# ప్రణవ విభవం

కవితల సంపుటి



రచయిత

అనిపెద్ది జగన్నాథశాస్త్రి

# ప్రణవ విభవము

(కవితల సంపుటి)

అనిపెద్ది జగన్నాధశాస్త్రి
పి.జి.టి. తెలుగు
ఆంధ్ర గురుకుల పాఠశాల
కె. ఆర్. పురం - కన్నాపురం
ప॥ గో॥ జిల్లా.

ప్రతులకు :
శ్రీ అనిపెద్ది శ్రీరామచంద్రమూర్తి
కానూరి వారివీధి, రామచంద్రరావుపేట
తాడేపల్లిగూడెం
ప॥గో॥జిల్లా.

సర్వస్వామ్యములు :- రచయితవి
ప్రథమ ముద్రణ
ప్రతులు - 500

శ్రీ ధాతనామ సం॥ కార్తీకబహుళ పౌర్ణమి
(25-11-1996)

మూల్యము : 20 రూ॥లు

ముద్రణ :
శ్రీ సత్యనారాయణ ప్రింటింగ్ ప్రెస్
కొయ్యలగూడెం -ప॥గో॥ జిల్లా, ఆం ప్ర.

# "నండూరి రామకృష్ణమాచార్య"

# ఆశీరభినందనములు

''ముసలి తనము రాకముందు పెద్దరికమ్ము
పడయవచ్చు—కవితవలన—ప్రజలు
బధిర సంఘమునకు— బహిరంత రాత్మలై
మెదలగలరు— కవులు— కదలగలరు,,

శ్రీ అనిపెద్ది జగన్నాథశాస్త్రి కవితా హృదయంగల రచయిత— అని ప్రణవ విభవంలోని ఖండికలు ఋజువు చేయగలవు. ఊరు తెల తెలవారగ ఏరు గలగల పారుతూవుంటే—చేలపరిసరాలు— కమలాల చూపులుప వనాలు పాటలుపాడి ఈ కవి కుమారుని నిత్యము మేలు కొల్పగలవు. "కన్ను తెరచి మూసేలోపల ఉన్మత్త వేషాల గమ్మత్తులెన్నో"ఆదిశక్తినీ; జగన్మాతను చూడగల కవితా మనో నేత్రం శ్రీ అనిపెది జగన్నాథశాస్త్రికి ఉన్నది. అచేతనా వర్తపు ప్రపంచంలోంచి చేతనావర్తపు ప్రపంచంలోకి చూడగల "గవాక్షం" ఈ కవి నివాస గృహంలో ఉన్నది.

అనిపెద్ది జగన్నాథశాస్త్రి వ్రాసినవి అన్నీ "వచన కవితలు''

" లోకమందు— కవిత— ఆకాశ విహగమే
ఎగుర వలయు గొప్ప స్వేచ్ఛతోడ,
ఛందమనెడి ఇనుప సంకెళ్లలో కట్టి
భద్రపరుపరాదు. పంజరమున "

అనే వాదంలో కొంత అంతరార్థం ఇమిడి ఉన్నది.

" గద్యం కవీనాం నికషం వదంతి " అన్నారు పెద్దలు ఈ ప్రణవ విభవంలోని కవితలు అన్నీ రెక్కలు మొలిచిన పిట్టలే. కనుచూపు మేర తప్పిన తరువాత అనంతాకాశంలో అదృశ్యమై పోతాయి. "నమస్తే నమః'' శీర్షికలో శ్రీ జగన్నాథశాస్త్రి కవి- వే దాం తి గా సాక్షాత్కరిస్తాడు. ఈకవి మాధుర్య రసవత్ కవిత వ్రాస్తూ-"సర్వం సహా చక్రవర్తికి" నమస్కరించి శరణాగతుడౌతాడు.

జగన్నాథశాస్త్రి తన కవితా భావనలను హృదయ పంజరంలో దాచకుండా- విశాల విశ్వంలోకి వదలి వేస్తాడు

" కలలు రేపగలదు - కలవరింతలతోడ
కైపు రేపగలదు- కవిత తరచు
పొంత చేయగలదు- బొందెలో మోక్షమ్ము
దివిని భువికి -కవిత దింపగలదు

కవితా తపస్వి శ్రీ అనిపెద్ది ప్రణవ విభవం వ్రాసి జీవన్ముక్తుడైనాడు. ఈకవితలు చదివి సహృదయులు బొందెలో మోక్షం పొందవచ్చు. ఈకవితలలో సాహితీ ధ్వని మాత్రమే గాక ఓంకార నినాదం - ప్రణవ విభవం వినిపిస్తుంది.

శ్రీ జగన్నాథశాస్త్రి కవితలు వినిన గ్రుడ్డివారికి కూడ మనోనేత్రం విప్పారి హృదయంలో ప్ర ణ వ నా ద ం - వి ని పి స్తుం ది. శ్రీ జగన్నాథశాస్త్రి కవితలు చదివిన - చెవిటివారికి హృదయంలో ప్రణవ వైభవం వెల్లి విరుస్తుంది.

"శ్రీ జగన్నాథశాస్త్రి కవికి నా జేజేలు"

నండూరి రామ కృష్ణమాచార్య
అధ్యక్షుడు : రాష్ట్రస్థాయి
ఆంధ్ర పద్య కవితా సదస్సు

సికింద్రాబాదు-3
12-12-96

# శుభాకాంక్ష

కవితారంగంలో శ్రీ అనిపెద్ది జగన్నాథశాస్త్రిగారి తొలి ప్రయత్నం ఈ సంపుటి. దీని పేరు ప్రణయవిభవం. పేరులోనే ప్రతిధ్వనిస్తున్నాయి దీని ఆధ్యాత్మిక మూలాలు.

వస్తువుకీ రూపానికీ ఏదైనా సంబంధం ఉంది అని అంగీకరిస్తే ఈ సంపుటిలోని ఖండికలన్నింటా కనిపించే భావాలూ భాషా పద్యానికి లేదా ఛందోబద్ధ రూపానికి అనువైనవేకానీ వచన కవితకు అనువైనవికావు. తేలికగా అయిపోతుంది కదా! అనిపీరు ఈరూపాన్ని ఎంచుకున్నట్టున్నారు. మొదటనుంచీ వచనకవిత్వానికి అదొక అదనపుఆకర్షణ అయ్యింది. వ్యవహారికభాష ఛందోమయరూపానికి సరిపోనట్టే గ్రాంధికభాష వచనకవితారూపానికి సరిపడదు. అయినా ఇది వీరి తొలి ప్రయత్నం కనక, ఇలా చేసినవాళ్ళు చేస్తున్నవాళ్ళు ఇంకా చాలా మంది ఉన్నారు కనక, మనం అట్టే పట్టించుకోనక్కరలేదనుకుంటాను.

కవితా రచన చెయ్యడానికి అవసరమైన ముడిసరుకు ఉన్న మనిషిలాగానే కనిపిస్తున్నారు శ్రీజగన్నాథశాస్త్రిగారు. అక్కడక్కడ గొప్ప మెరుపులు ఉన్నాయి. నాజగం / గజం ముందుకు జరిగిందంటే। గతం కొంత వుందన్నమాట(పుట-౩), నా హృదయ కవితా మండపాన। మమతా తపిస్వని। మానవతావాది ఎవరో। రసమయ వచన కవితాఖండికలను చదువుతోంది (పుట-6), లోకన్ను మాగన్ను అయితే। దేహం ఊరేగుతుంది. (పుట-9) గుండెను దువ్వెనగా చెక్కి ఇమ్మంటోంది. (2 7), ఈ దివాళా లోకం। దేశవాళీ మిరపకాయబజ్జీ లాంటిది। కారాకిళ్ళీలా నమిలి ఉమ్మేయ్। పరిస్థితుల ఉద్రిక్తతను (పుట-46), వచ్చిపోయే వేళలో। ఒంటరి నీవు। తుంటరితనమేలా (47) ఇత్యాదులు ఆ మెరుపులలో కొన్ని.

సమసమాజం, మానవతావాదం, శ్రమశక్తిని గుర్తించడం కులమత నిర్మూలన- మొదలైన ఆధునిక భావాలుకూడా వీరికి వున్నాయి. ఇవి అవగాహనతో ఏర్పడ్డాయో లేకపోతే అలవాటున పడ్డాయో చెప్పడం కొంచెంకష్టమే! శ్రామికులూ కార్మికులూ గురించి "సోమరిలో" మాట్లాడుతూ- ఆలోచించావా ఎన్నడైనా। వాళ్ళు సుఖంగా వుండాలని (పుట-62)అన్నారు. అదే పుటలో అన్నాఅనే శీర్షికలో కులమతనిరసన, ప్రగతి పథగమనం వగైరాలు వున్నాయి.

బ్రతుకులో నటించడం కన్నా హేయమేముంది.(పుట-60) అని అడగగలిగిన మనిషికి, ఆశనీ-నా శ్వాస (63)అనికుప్తీకరించ కలిగిన వ్యక్తికి ముడిసరుకు లేదని ఎలా చెప్పగలం?

సిద్ధాంతపరమైన అవగాహన వున్నా లేకపోయినా బ్రతుకు నిజం కనుక, అందులో ఎదురయ్యే ఘర్షణలు నిజం కనక వీరు స్పందించకుండా వుండలేకపోయారు. కారణం తెలవకపోయినా ఎక్కడో ఏదో తేడా జరుగుతోందని గ్రహించగలిగారు. 'ఎవరో' (52) అనేది ఈ సంపుటి మొత్తంలో నాకు నచ్చిన మంచి కవిత. వ్యాపారసంస్కృతి అనేది మనకుతెలియకుండానే మనరక్తనాళాల్లో ప్రవేశించి సారాన్నిసారాంశాన్నీ ఎలా తొలిచేస్తోందో. కవితా మయంగా ఇందులో అవిష్కృతయ్యింది. ప్రతీ అక్షరమూ ఉదహ రించదగిందే. అందుకే వదిలేస్తున్నాను.

ఇది చదివాక జగన్నాథశాస్త్రిగారి మీద నాకు కొంచెం ఆశ కలుగుతోంది. వీరు మరింత జాగరూకులై జీవితాన్ని అనుశీలిస్తా రనీ,ఇటీవలి కవితాసంపుటుల్ని అధ్యయనం చేస్తారనీ, తనకు తాను పదునుపెట్టుకుంటారనీ ఆకాంక్షిస్తున్నాను. సెలవు.

మీ

బొమ్మూరు
9-12-96

బేతవోలు రామబ్రహ్మం
పీఠాధిపతి, తెలుగు విశ్వవిద్యాలయము.

# మంగళా శాసనము

ఇది వచన కవితల సంపుటులు జోరుగా వెలువడుతున్న కాదు. ఇవన్నీ ఖండకావ్యాలే! ఖండకావ్యాన్ని సంఘాతం అనికూడ ప్రాచీనులు వ్యవహరించారు.

ప్రకృతం వెలుగు చూస్తున్న ఈ " ప్రణవ-విభవం " కవితల సంపుటిని రచించిన కవి చిరంజీవి అనిపెద్ది జగన్నాథశాస్త్రి పాలుకొల్లు లోని శ్రీ క్షీరారామలింగేశ్వర స్వామి ప్రాచ్యకళాశాల విద్యార్థి కవిగా ఇతనికి మంచి పేరుంది. ఈ సంపుటిలోని కొన్ని కవితలు "తెలుగు విద్యార్థి" "విశ్వరచన" మొదలైన పత్రికలలో ప్రచురితాలు. మా కళాశాలలో చదువుకొంటున్న రోజుల్లోనే చి॥ శాస్త్రి 'శ్రీ శ్రీ' గారి ' మహప్రస్థానం ' లోని గేయాల్ని మహా ఆవేశంగా చదువుతూ తోటివిద్యార్థుల వెంటపడి వాళ్లకి హడలు పుట్టించేవాడు। ఆవేశకావేషాలుకల చిన్నవాడు. భావుకుడు. ఇతని చిత్తం నిత్యవేగి "శబ్దాల్ని తాపీగా ఏరుకోనివ్వని భావశీవ్రత" కనుక అక్కడక్కడ శాబ్దిక దోషాలు దొరిలాయి. అయినా ఇతను మంచి కవి అని అనడానికి సంశయించవనవసరంలేదు.

సామాజిక స్పృహ, దళితవాదం, స్త్రీవాదం మొదలైన "ఇజమ్ము"తో విసిగి వేసారిపోయే పాఠకులకి ఈ 'ప్రణవ-విభవం' కవితాసంపుటి కొంతైనా ఊరట కలిగిస్తుంది– ఇతను ఏ 'ఇజమ్'కి లొంగిపోయినవాడుగా తోచదు. అలా అని సామాజిక స్పృహ అసలే లేనివాడనడంకాదు. ఆ స్పృహతో రచించిన కవితలు "సైకిలు," 'ఒంటెద్దు,' "గవాక్షం, జీవితం" వంటివి ఈ సంపుటిలో లేకపోలేదు. కాని ప్రధానంగా ఈ కవి అనుభూతి వాద కవి గా

కాన వస్తాడు- 'కళాప్రాంగణం', 'వ్యాఖ్యాత', 'ఆమె', 'ఆకాంక్ష' "ప్రతీక", 'అవనిత', 'కవి', 'హంస' "లలిత" వంటి కవితలు అందుకు కారణాలు. అంతేకాదు.ఈ చిరంజీవి భావనాశక్తికి నిదర్శనాలు. ఇతనిలో తాత్త్వికచింతన కూడా పుష్కలంగానే గోచరిస్తుంది ఈ ధోరణిలో సాగిన కవితలూ ఉన్నాయి ఈ సంపుటిలో.

ఈ కవిగళం ఆవేశపూరితం కనుక ఇతని కలంనుంచి మరిన్ని ఉత్తమ కవితలు- భావిలో వెలువడతాయని నా ఆశ! ఆశంస!

నిజానికి ఈ సంపుటికి నేనుకాక ఇంకొకరెవరైనా పీఠిక వ్రాసి ఉంటే సముచితంగా ఉండేది- మా యిద్దరిమధ్య కల గురుశిష్య సంబంధం ఇతన్ని ప్రశంసించడానికి అడ్డు వస్తోంది.

కాని గురువుగా ఒక్క మాట! ఇతనే 'కవి' అనే కవితాఖండికలో

" తోచిన దెల్ల కవితకాదు
వ్రాసినదెల్ల కావ్యమ్ముకాదు"

అని అంటున్నాడు. ఇటువంటి వివేచనా శక్తి కలవాడు కనుక భావావేశములోపడి కొట్టుకుపోకుండా భావవ్యక్తీకరణకి సాధనమైన భాషపట్లకూడా మరింత శ్రద్ధ వహిస్తాడని ఆశిస్తున్నాను. ఇతోధిక యశోభివృద్ధిగా ఆశీర్వదిస్తున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తి
రిటైర్డు ప్రిన్సిపాల్
క్షీరపురి ప్రాచ్యకళాశాల.

గుమ్మలూరు
7-12-96

# నా మాట

గ్రంధకర్త చిరంజీవి శ్రీ అనిపెద్ది జగన్నాధశాస్త్రిగారు నాకు చిరకాలమిత్రులు. తాడేపల్లిగూడెమందలి తెలుగు 'సాహితీసమాఖ్య' అను సంస్థ ద్వారా వీరి పరిచయం నాకు ఏర్పడినది. వీరు భావ కవులు. రసజ్ఞ శేఖరులు. సాహితీ ప్రతిభా సంపన్నులు.

నేను ఈ గ్రంధమందలి కొన్ని కవితలు చదివితిని. వీరి రచనలో "శశిరకాంత", "దేవాధిదేవుడు", "నిశ్శబ్ద సంగీతం", "బొంగరం" చదివినచో కవిహృదయము ద్యోతకమగును. 'దేవాధి దేవుడు'లో కవి భౌతిక జీవితమునకు విసిగి భగవంతునితో ఏకత్వ మొందవలెనని ఉత్కంఠ చూపిరి. వీరి కవితలో అలౌకిక సంపత్తిని కొనియాడిరి. ఆధ్యాత్మిక మార్గమునకు మన మనసులు మళ్ళింపవలెనని ప్రయత్నించిరి.

భగవంతుని వద్దనుంచి వచ్చిన మనము తిరిగి అతని వద్దకే చేరవలెనని అదే జీవిత పరమార్థమని వీరిభావన.

" ప్రణవం ' అనే కవితలో ' ఓంకారంబది ప్రణవంబు ' ''ప్రణవంబే ప్రాణాధారం ' అంటారు ప్రణవనాదోపాసనకు ఎల్ల లోకములు దద్దరిల్లునని వీరి భావన. లలితకళలను యోగముద్వారా భగవంతుని చేరగలమని వీరి విశ్వాసము.

వీరు ఈ ప్రణవ విభవమును వారి పితామహులకు సమర్పించుట ముదావహమై యున్నది.

ఈ కవికిది ప్రథమ సోపానము. ఇంకను అనేక ఉన్నత సోపానముల నధిరోహించ వలసియున్నది. దానికి రసజ్ఞ పాఠకుల ప్రోత్సాహ మవసరమని నాభావన.

భగవత్ప్రేమలో

తాడేపల్లిగూడెం — మెహర్ శ్రీ బాలగోపాల భాస్కరరాజు

10-11-96 — చిత్ర లేఖకులు

# విజ్ఞప్తి

రసజ్ఞులకు విజ్ఞప్తి :

అపుడపుడల వోకగ వ్రాసిన కవితల నేరికూర్చి ఒక సంపుటిగ చేసితిని. అదే ప్రణవ విభవ మైనది.

అనుభూతి ప్రాధాన్యతతో కూడిన భావకవిత యిది. ముఖచిత్ర మందలి తరంగాలు భావతరంగాలు చేతిలో పద్మం హృదయం. అందలి లలిత కళోపకరణల లక్ష్యం భగవంతుని చేరడం.

ఈ కవితా సంపుటి లౌకికాలౌకిక భావాల సంయోగం. ప్రకృతి ప్రణయ-భావ సమ్మేళనం. వేదానా వాదనల సందోహ సందిలి. ఇవి మధురోహలు అనుద్దేశ్యాలు. అప్రయత్న భావ సంభరితాలు. ప్రణవ విభవ వీచికలు.

ఈ కవితా సంపుటిని కీర్తిశేషులైన నా పితామహులు " అనిపెద్ది జగన్నాధశాస్త్రికి" అంకిత మిచ్చుచుంటిని. వారి దివ్యాత్మ నన్ను ప్రేరేపించని ఘడియలేదు. వారి కీర్తి గోదావరీ నదీ తరంగముల వోలె అజరామరం. వారి వా క్కు లు అమృతోపమానాలు. వారి పురాణ ప్రవచనం గంగా ప్రవాహోత్తుంగ తరంగం. ముగ్ధ మనో హరం. తన్మయోద్వేగ సమ్మోహనా భావ సంభరితం. వారు నైష్ఠిక మార్గానుయాయి. వేదవేదాంగ విద్యా సంపన్నులు. జ్యోతిషంవారి ఊపిరి. అట్టి మహనీయునికి ఈ సంపుటి ఇవ్వడం చంద్రుని కో నూలిపోగు వంటిదే!

నేను క్షీరపురి కళాశాలలో చదివే రోజుల్లో కీ.శే "మల్లంపల్లి వీరేశ్వరశర్మ" అటు ప్రాచీన సాహిత్యంలోనూ, ఇటు పూజ్యులు

శ్రీపాద కృష్ణమూర్తి గారు ఆధునికాంధ్ర సాహిత్యంలోను మమ్మల్ని ఉత్తేజిత లూగించేవారు.

" తెలుగు వాఙ్మయమంతను తెలుపువారు
ఆధునిక కవితను కొనియాడువారు
పుస్తకంబున్న మున్ముందు ముట్టువారు
వరగ నొజ్జలు మాకు శ్రీపాదవారు "

అని అప్పటిలో మేము అనుకొనేవారము ఆట్టి వీరు నాపై గల శిష్యవాత్సల్యంతో ' మంగళాశాసనాన్ని " పలికిరి.

తెలుగు విశ్వవిద్యాలయం సాహిత్య పీఠాధిపతులు ఆచార్య " శ్రీ బేతవోలు రామబ్రహ్మం గారు " శుభాకాంక్ష లందించిరి. శ్రీ పాలగోపాల భాస్కరరాజుగారు, అడవి బాపిరాజుగారి కుంచెను వారసత్వంగ పొందిన చిత్ర క ళా త ప స్వి. వారు ఈ సంపుటికి ముఖచిత్రమందించుటేకాక ప్రణవ విభవమని పేరిడుటకు కారకులైరి. అంతేకాక " నామాట" పలికి నన్ను చరితార్థుని చేసిరి. వీరందరికి నా కృతజ్ఞతలు.

శ్రీమాన్ "నండూరి రామకృష్ణమాచార్యులు' ఈ సంపుటికి ఆశీరభి నందనలందచేసి నన్ను పునీతుని చేసిరి. వీరు కవితా కిరీటధారి. జగమెఱిగిన పండితులు. పుంభావ సరస్వతి. గద్యపద్య కాదాతోర బాద్యనేక కావ్య నిర్మాణ చాతురీ సవ్యసాచి. వీ రి గూ ర్చి " శ్రీ శనగన నరసింహ స్వామి " గారి మాటలలో

" హృదయమమృత సముద్రము వదనము
కవితా లతాంగికి నర్తనశాల, సదన
మతిథి కోటికి నాటి ఋష్యాశ్రమము
విశాల వసుధా కుటుంబి నీసాటి నీవె: "

అట్టి వీరు ఇటీవల అధికార భాషా సంఘమునకు అధ్యక్షులుగ పని చేసిరి. ఇపుడు రాష్ట్రస్థాయి పద్యకవితా సదస్సుకధ్యక్షులుగ పని చేయుచుంటిరి. నాపై గల అపార అభిమానముతో నాకు ఆశీరభినందనలు పంపి నన్ను ధన్యుని చేసిరి. వారికి నా భక్తిపూర్వక ప్రణామములు.

ఈ కవితలు గతంలో కొన్ని "మధుమంజరి, విశ్వరచన, తెలుగు విద్యార్థి" పత్రికలలో ప్రచురింపబడినవి. ఆకాశవాణి విజయవాడ కేంద్రంవారు ప్రసారం చేసిరి. వారికి నా ధన్యవాదాలు.

ఈ పుస్తకాన్ని ఆవిష్కరించే బాధ్యత తమ భుజస్కంధాలపై వేసుకున్న మా క్షీరపురి ప్రాచ్యకళాశాల ఆంధ్రోపన్యాసకులు శ్రీ వి. కె సత్యనారాయణ గారికి నా నమస్సులు. తమ అమూల్య సలహాలు, సూచనలిచ్చిన శ్రీ ఎమ్. వి. యస్. ఎన్. మూర్తి, శ్రీ టి. వి. నరసింహారావు లకు నా కృతజ్ఞతలు.

ఈపుస్తకాన్ని శ్రద్ధతో అచ్చొత్తిన శ్రీ గుళ్లపూడి వెంకటరమణ, వారి సిబ్బందికి నా అభివందనలు.

రసజ్ఞులైన పండితులు దోషాలు తెలిపిన సవరించుకోగలనని మనవి.

కె. ఆర్. పురం

18-12-96

ఇట్లు

బుధజన విధేయుడు

అనిపెద్ది జగన్నాథశాస్త్రి.

# అంకితం



కీ॥ శే॥ అనిపెద్ది జగన్నాథశాస్త్రి

శ్రీ మంగమ వెంకటరత్నుల
వినయమైన పుత్రరత్నా!
మీ పుట్టిన వేళెట్టిదో!
కన్నవారి పున్నెమో!
చిన్నపుడే కవన మల్లి
ఎల్లరి మన్ననలతో
ఎల్లారి కృపను గనిరి
శ్రీ దక్షిణామూర్తి వద్ద
తణుకులోన, అణుకువతో
శాస్త్ర కావ్య పౌరాణిక
గ్రంథాలెన్నెన్నో!
మనసు పెట్టి పఠియించిరి;
కార్తీకపు మహాత్మ్యం!
సత్యభామ పరిణయాది

సత్కృతులను
మృదు మధురశైలి రచియించి
సంస్కృతాంధ్ర భాషలలో
పండితులకు పండితులై
సభలలోన మెప్పొందిరి
జ్యోతిషం! తర్కం! మీ మాంస!
అంటే మీకు మరీ మరీ ఇష్టమట.
లౌక్యంతో సౌఖ్యంగా
బ్రతికి మీరు వంశానికి
ఎనలేని కీర్తి తెచ్చి
జీవితాన్ని సార్ధకతను చేసికొనిరి!
మీ చేతితో మీరెనాకు
ఓనమాలు దిద్దించిరి
కన్నవారు కావాలని
మీ పేరే నాకిడిరి!
మీ నీడను తుదిదాక
నాలోనె చూచుకొంచు
బ్రతుకుచుందు నెల్లపుడు
గైకొనుడీ మధురమైన
కవితల సంకలనం !



# దేవాది దేవుడు

రసమయోద్వేగ
భావనల, నాఎద
ప్రళయ తాండవమాడ
గుండె ఢమరుకలు మ్రోగ
ఊపిరులు లేచొచ్చి
శివఝటాజూటిలా
అటు నిటు కదలాడి నిల్వ
పెదవిపై శాబ్దికంబంతయు
పంచాక్షరిగమార!
సంగీతరాగ
సురభిళ ప్రసూనాలవి
జల జల రాలినవి
తన్మయానంద బాష్పధారలతో
దోసిలొగ్గితి నేను
ఈ జగతికని
సిగ్గిల్లి శోకమూడ్చితి!
జనన మరణాల కతీతుడెవరో!
ఎవ్వరీ జగతి
నడిపించుచున్నారో!
సంసార బంధాల
కట్టికుడిపేదెవరో!
అట్టి శంకరుని గొంతెత్తి పిల్చితి
రావయ్యా! రమ్ము! రమ్మంచు
ఆ దేవాదిదేవుని

# నిశ్శబ్ద సంగీతం

నిశ్శబ్దం లోంచి
సంగీతం పుట్టుకొస్తోంది!
అది నాలో - లో లో
శతాబ్దాల చరిత్ర త్రవ్వుతోంది!
ఈ మట్టిలో వాసన
మానవాస్థి పంజరాలలోని
ప్రాణాల్ని జ్ఞప్తికి తెస్తోంది!
తరం తలచుకొని
అంతరంగంలో
అంతరాంతరాల్లోకి పోతే
ఎంతో కాంతివంతమైన
వింతవింత చరిత్రలు
కనబడుతున్నాయి!
సమున్నత మానవ
మేధా సంపత్తి నన్ను
కదిపి కుదిపి వేస్తోంది
అంతర్లోకాలలీలలు
తన్మయత్వంతో భావిస్తోంటే
అభావన మంచిని చూపి
నాలో పూర్వీకుల ఔన్నత్యాన్ని
తలపింప చేస్తోంది!

నా జగుః గణింపబడుందుకు జరిగిందంటే

గతం : కొంత వుందన్నమాట :

నా జ్ఞాన పరిధిలో

అజ్ఞానం మేఘావృతమై

ఆలోచనల వర్షం కురిపిస్తోంది

తాత్త్వికం తారస్థాయికి చేరి

సాత్త్వికాన్ని నాలో

చిరంతనంగ వెలిగొల్పుతోంది:

నే విశ్వ జనీన

మేధా సంపన్నుణ్ణి :

అద్భుత పరమాద్భుత

లోకాలు వర్ణించగల సామర్థ్యుణ్ణి

కాని నా ఊహలో

వాస్తవం, పెనుతుఫానులు సృష్టిస్తుంది

నా కలంలో

చైతన్యం విద్యుచ్ఛక్తియై

విశ్వంలోని

అజ్ఞానాంధకారాన్ని

తొలగించే మానవ

మేధస్సుల్లోని దీపాలుగ వెలుగుతుంది.!

# శిశిరకాంత

శిశిరకాంత
మృదుమధురాధరంపై
ఎఱ్ఱ గులాబీల అందం!
మంచు బిందువుల
ముసిముసినవ్వులు
ప్రకృతి-పురుష సమాగమోద్వేగ
సమ్మోహనాభావం !
ఆమె పచ్చని పైట చెరగుపై
మంచు చెమికీల తళతళలు
తూర్పు దిగంగన
వెలార్చే పసిమి మిసిమి
బంతిపూల సౌరభం
బిళ్ళలుబిళ్ళలుగ
కొలను నీటి రవి కిరణ పుంజాలు
చలికి లొంగని
పక్షిజాతాల కిలాకిలారావాలు
జ్ఞాన భానురేఖల దోబూచులతో
నిబిడ అజ్ఞానపు
వ్యామోహ హిమ ధూమరేఖలు
ఐనా వాస్తవం వాస్తవమే!
కనరాకున్నా కనకలిగినా
అజ్ఞానమజ్ఞానమే !
జ్ఞానం జ్ఞానమేగా !

# చిరుదివ్వె

చీకట్లో చిరుదివ్వె
కొండెక్కుతోంది!
స్నేహ వాసనలన్నీ
అడుగంటుతున్నాయి!
కడగట్టు బ్రతుకుకు
కడగండ్లె అన్నీ!
వడగండ్ల వానలో
వొంటెద్దు పోకడలు
ఎగుడు దిగుడలలోని
నలుగుడులు అన్నీ
మాయాలోకంలోని
జంతరమంతర్లెన్నో!
రాకపోకలలోని
రాపిడిలు అన్నీ!
కన్నీటి జలకాల
కేరింత లెన్నో
పులకిత కిలకింత
కనుమూత దాకే!
మనోలోకం లోని
తలుపులన్నీ తెరచి
ఆధ్యాత్మ గాలుల్ని
మనసార పీల్చాలి!
వెలుగు లోకం వైపే
అడుగేసి సాగాలి!

# కళాప్రాంగణం

నా హృదయ
గాన మందిరంలో
సదయ, ఎవరో సహృదయ!
సంగీత గాన కచేరీ చేస్తోంది

నా హృదయ కవితా మండపాన
మమతా తపస్విని
మానవతావాది ఎవరో
రసమయ వచన కవితా
ఖండికలను చదువుతోంది

నా హృదయ నాట్య కళాక్షేత్రంలో
సరసహృదయ ఎవరో నాట్యకత్తె
నవరస నాట్యభంగిమలను
చూపుతోంది

నా అగాధ బాధాహృదయ కుహరంలో
ఉన్మాద చిత్ర కళా తపస్విని ఎవరో!
వివిధ చిత్ర విచిత్ర
భావరేఖోల్లేఖనాలు చేస్తోంది

నా శిలాసదృశ జీవితాన్ని
దీక్షాకంకణధారిణి ఎవరో
అపురూప శిల్పకళా ఖండంగ
ఉల్లేఖన చేస్తోంది!

## తాత్త్విక చింతన

సమాధ్యవస్థలో, తన్మయోద్వేగినై
తాత్త్విక చింతనతో, దైవయోగాన్ని
అలవర్చుకున్నాను
కలలా, ఇల ఒకవలలా
నాకన్నులలోనె కదలాడింది
కపటం, కాలుష్యం
ఎల్లెడలా కనిపించాయి
సంయోగం! వియోగం!
అన్నీ నాలోనే, లోలోనే
వినిపించని రాగం
కన్పించని భావంతో
వేదననే కల్పించెను
జాగృతమౌ శక్తిదో
జీవంగా దేహంలో
ఊగిసలాడి, అలసటతో
గుండెల ఊయలలో నిదురించెను.

## సంధ్య

కోరికలు జవనాశ్వాలైతే
ఆశయాలు, రెక్కలార్చినవిహంగాలు
గాఁడాంధకార మలిమినవేళ
దూరాన నింగిలో తళతళలాడు తారలు
చక్రవాకపు వక్రరాగాలు
జీవన సంధ్యారథ్యలో గమ్యంలేని
సుషుప్తి గమనం

# దివ్యత్వం!

మన శ్శరీరాలను
దేవదానవ భావాలతో
మంధర పర్వతం!
మధించినట్లు మధించవోయి!
దివ్యత్వం గోచరిస్తుంది
దైన్యం తొలగిపోతుంది
ధైర్యం పొగిలి వస్తుంది
ఆత్మ సమున్మీలితమై
అహంకారం నశిస్తుంది
దోషాలు ప్రక్షాళితమౌతాయి
పునర్జన్మ ఎత్తుతావు
జన్మ అంతు తేలుస్తావు
జీవాత్మను తెలుసుకుంటావు
అమృతం దోసిళ్ళతో త్రాగుతూ
జన్మ మృత్యు జరా తప్తాల్లేని
పరమాత్మలో కలుస్తావు!

# దైవం

దైవం నీలో నాలో
ధ్యానంలో గానంలో
సంయమనంలో సద్యోగంలో
సంకల్పంలో దైవం నీలో నీ భావంలో
నీ చిత్తంలో నీ చిత్రంలో
నీ కగుపించకనే నీలో
దైవం నీలో నాలో
ఎల్లెడల.... అన్నిటిలో

## వేకువ కాంత

ఊరు తెలతెల వారగ
ఏరు గలగల వారుతుంటే
వేకువ కాంత లేచింది !
తెచ్చిందెన్నో కాంతులు !
ఇచ్చిందెన్నో కానుకలు
వేయి గులాబీల పరిమళాలు !
విహగాలు పేశల పలుకులు
కుసుమాల కాంతుల నవ్వులు !
కమలాల నయనాల చూపులు
పవనాల కరాల స్పర్శలు
కిరణాల తళుకుల మెటుపులు
ఇవన్నీ దోసిటబట్టి
మందస్మిత వదనంతో
కాంతితో వేకువకాంత
మంచిని పెంచే భావనతో
నెమ్మదిగా లేపింది లోకాన్ని

## ఆత్మానందం

కన్ను తెరచి మూసేలోపు
ఉన్మత్త వేషాల గమ్మత్తులెన్నో
లోకన్ను మాగన్నయితే
దేహం ఊరేగుతుంది మోహం చెలరేగుతుంది
నిశ్శబ్దంలో నిర్మోహత్వంతో
స్తబ్దతను వీడి చైతన్యం పొందు
మనస్సును రగుల్చుకోకు
ఆత్మానందం మిగుల్చుకో

# ఈ దేహం

దీని కేల కూడు ?
దీని కేల గూడు ?
దేనికది పోగా
నేనేగా ! ఇది
చేసేది సచ్చి మోసం
పొట్టి దగా !
దర్జా దీని కెంతో !
దర్పం దీని కెంతో
ఉట్టుట్టి కాపురానికి
ఉలుకులుకు లెన్నో !
అన్ని తనకే కావాలి
అందరు తనవారే !
అనుభవాలెన్నో !
ఆక్రందన లెన్నో
సక్రందన లెన్నో
ఇల్లలుక పండుగా ?
మూలసూత్రం
కనుగొనే నాథుడేడి ?
ఈ దేహం ! పెరిగి తరుగ
పొరిగిన దేమి ?
జ్ఞాన నేత్రం తెరచుకుంటే
శూన్యభావం వెనుక
అపరిమేయ అద్వితీయ
అవిచ్ఛిన్న ఆత్మజ్యోతి
వెలుగును కనలేమా ?

## అమ్మ

అమ్మ అనే పదంలోనే
అంతులేని కమ్మదనం!
అమ్మ మనసు అంతకన్న తియ్యదనం!
మననెంతో కష్టంతో
మోసి కని, తీయనైన
పాలనిచ్చి, తన పాలనలో
నిండుగుండె పొంగి పొరల
అనురాగం, ఆత్మీయతనందించి
విద్దెనిచ్చి పెద్దచేసి
బుద్ధిగాను బ్రతుకమంచు
చెప్పునామె! ఎన్నడును
కడుపుతీపి విడువకుండ
తన నీడను తుది దాక
మనలోనె చూచుకొంచు
చెప్పలేని మురిపెంతో
మన బాగే తన బాగుగ
కోరుకొనును, అందుకనే
అమ్మంటే నాకెంతో ఇష్టం

## చిలుక

పంజరాన చిలుకొకటి
పొడకట్టును నీ దృష్టికి
అదికాస్తా ఎగిరిందా
ఆనాటితొ ఆటకట్టు
సృష్టి చిక్కు సడలాలని
నిజందారి తెలియాలని
ఇష్టంగా నీకుంటే
చిలుకనే పట్టిచూడు!

# ఈ లోకం

ఈ లోకం నీది కాదు
ఆ లోకం నీది
అవలోకన, నీ పరమావధి
ఆ దివ్యుని, ఆ భవ్యుని
అడుగుజాడ
అంతరంగమందె కాదు
అంతటను అగుపించు
ఆ నీలి నీడ తోతెంచు
చిగురాకైన చక్కని
ఆధ్యాత్మికత నందించు
తాదాత్మ్యపు చింతనలో
తన్మయంపు సాధనలో
జీవయాత్ర సాగించిన
లోలోతుగ ప్రార్థించిన
సుస్థిరమౌ, సుప్రశాంత వేళలో
అగుపించును భగవంతుడు
అన్నీ చెప్పును నీకు
ఆ మార్మోగేనాదంబే
నీలో ప్రతిధ్వనులు
ఆ మహనీయుని రూపే
నీ చూపు, నీ ఊహ, నీలో
ఆ అడుగుజాడ
తేల్చలేని, పోల్చలేని
స్మరించలేని తలవంపులు
తలంపు చాలదు తన్మయం చెందు
తాదాత్మ్యం పొందు ఎదురు చూడు
దైవమే నీవుగా మారే శుభ వేళకై

# బంధం

కావలసి బంధం
కావలసినన్ని బంధనాలు
ముల్రత్రాడో! మెడత్రాడో !
పసుమరిదేహికి అన్నీ కష్టాలే
ఇంద్రియ వాసనల కాలుష్యమే
సహస్రారం భ్రూ నాడీకేంద్ర బిందువును
స్పందింపచేసి, అద్భుతతేజం
ఆధ్యాత్మిక జ్ఞానాన్ని మనిషికందిస్తే
అంతర్లోకం లో స్వర్గాన్ని దివ్యదృష్టితో కనలేడా ?
అమవశినిసికూడా పున్నమేగా అపుడు
దారాల పోగులవి దూదిపింజలు
ఉప్! అంటే గాలికెగురు
బంధాలు మాలోక బంధాల
మాయలో మనిషేల మ్రగ్గు?
తిమ్మిరిలో తెలవదేనెప్పి
అధ్యాత్మ తెమ్మెరలే
అలుపు సొలుపు తీర్చు
రెక్కలలసినవాడు
రంగు రంగుల బ్రతుకు వెలవెల్ల నగు
విలువైన బ్రతుకుకు
వెలతగ్గినట్లనిపించు
తిలలొదిలితే బంధాలుతీరు !
తిలోదకాలేగ ముక్తినిచ్చేది
కాలమెంత గొప్పదో మరపు వరమౌను

# వ్యాఖ్యాత

అర్థమ్ము కాని
భావగీతమ్ములామెకనులు
ఏ చిత్రకారుడు, శిల్పి
తీర్చి దిద్దలేని విధాత్రు
నానతి వెలసిన కదలెడి
కుందనపు బొమ్మ ఆమె
ఆ కనులాసాజ్యధనువులు
వినీలాంబరపు నిర్మలంబులు
ఆమె మనోభావంబులు
ఏకవియు చెప్పలేనంత
అగాధంబులు, మధురంబులు
ఆ మేని ఒంపు సొంపులు
నెమలికొక వన్నె పెట్టు
ఏ సంగీత తరంగమ్ములామెను
కదిపి కుదుపునో కాని
అంతరంగ తరంగారావములవి
అలలవలె యేతెంచు
ఆపాతమధురమామె మనసు
ఆప్యాయతారూపమామె
అనురాగ సన్నిధి పోతపోసిన
మంచితనంపు మూర్తీభవమ్ము
భావాల మృదుచ్ఛలాంగుల చ్ఛవులకే
చలించునామె మనోవీణ తంత్రియలు
స్పందించు ప్రస్పందనామె
రసమయాఖ్యాన వ్యాఖ్యాత ఆమె

## ఆమె

ఆ కన్నులు నా పెన్నుకు తెన్నులు
ఆ అలకలు నా భావాలకు పోలికలు
ఆమె ఒక అపురూపముగ్ధమోహన సౌందర్యవతి !
గుణవతి, రసమయి ఆమె
నా నిరాశ, నిస్పృహ స్వీకరించింది !
సన్నగా తీర్చిదిద్దింది! కన్నుల కాటుకతో
బన్ను పెట్టి చుట్టింది! తన జుట్టుతో
గుండెను గుండెతో ముడేస్తుంది !
చూపును చూపుతో మెలేస్తుంది !
మాటను మౌనంతో కాటేస్తుంది !
ఆమె చిన్నగ ఒక్క నవ్వు నవ్విందా !
నా గేయం లో రసం నసాళాన్నంటుతుంది !
చెప్పక చెపుతుంది ఎప్పుడూ నాతో
ఈ కట్టు నీ కోసం! ఈ బొట్టునీ కోసమని
నిశ్శబ్దంగా ఎటో చూస్తున్న ఆమెను చూస్తుంటే
ఎందుకో, కొసరి కొసరి వస్తున్నాయి!
ఎన్నో భావాలీగుండెలోకీవేళ !

## స్త్రీ కాటు

ఏదో పిచ్చి పట్టి నిన్ను రెచ్చగొడితే
నా గుండెలపై కసుక్కున కాటేసావు
అ పిషాన్ని దింపుకో లేక
ఆ నిమిషాల్ని మరువలేక
ఇప్పటికీ నామనస్సు
అంతులేని నరక యాతన
అనుభవిస్తోంది!

# ఎడద అడవి

ఏ సెలయేటి పాటో!
ఎదలోన రాద చేయసాగె
ముకుళిత పద్మాన చిక్కిన భ్రమరమల్లె
దూరతీరాన్నుంచి ఏవేవో ప్రేమంపు
గాలికబురులు మోసుకొచ్చె
ఈ చిలిపి మనసు
చిఱుజింకలా గంతులేసె
కోరికల కోకిలలు కూకూలు పెట్టసాగె
ఏ ఋష్యాశ్రమంబో
ఈ ఎడద శాంతి దేవత
రాజ్యమేలె వనరమ
నవనవోన్మేషంబయ్యె
కవన కాంతులు విరజిమ్ము పూలన్ని
నా చెలికి స్వాగతాంజలిలు
పలికె మనసు పులకింప
నెమలి పురివిప్పి నాట్యమాడె
సాంధ్యరాగంబంత
ఎడద అడవి విడిది చేసి
వన్నె చిన్నెల ప్రకృతి కాంత నలరింపచేసె
ఎక్కడో ఆకురాలిన చప్పుడిక్కడే తోచు
సాధు సాంగత్యరమ ఎడద విడిచి పోదేమొ
పుష్పాంజలితో స్వాగత గీతాలాపనలుచేసె
ఎవరో ఆరసమయి హృదయ మాధుర్యోపాసి
సౌందర్య రసపిపాసి
ఈ ఎడద అడవి వాకిట నిలబడి మంత్రముగ్ధ వోలె
"రావచ్చునా" ? లోని కన్నట్లు చూచె!

# అంతర్ముఖం

కనులు మూసిన కనుదు
అగాధానకు పోయి ఆణించుముత్యాలెన్నో
కఠిక చీకటుల పోయి అలసితి
ఇంద్రియశ్వాలనెక్కి రారాజునైతి !
ఐచ్ఛిక భావనలు
స్వేచ్ఛగా పొందితి
గుణదోషాల కన్న
ద్విగుణీకృతమౌ వెలుగుకంటి
వేయి కన్నులతోటి
మాయలోకంలోని
వింతలన్ని చూసి నాలోకి నేపోతి
నలుగురితో నాకేల ఈ మాయగోల ?
కనులు మూసిన తోచు నా దోషాలునాకు
మాయ మర్మం లేని మంచిలోకం నాది
అధారమును వెదుకు అధేయమును నేను
నేనన్నదేదో నాకు తెలిసినవేళ
పరవశించినమేను పరుగులెత్తుట మాని
తన్మయానందాన నా మాట వినును
ఆత్మావలోకనలో మునిగి తేలాడు
కనులు మూసిన కనుదు
అగాధానకు పోయి ఆణిముత్యాలెన్నో !

# ఆకాంక్ష

సౌందర్య వంతమైన దృశ్యాన్ని
మనోహర చిత్రంగ
చిత్రించాలని వుంది !

అలవోకగు భావాన్ని
అపురూప శిల్ప కళాఖండంగ
చెక్కాలనివుంది !

దివి భువులు ఏకం చేసేలా
ప్రళయ తాండవ నృత్యం చేస్తూ
ఆనందరస సాగరాన వోలలాడాలని వుంది !

సప్తస్వరాల మేళవింపుతో
శృతిలయల సొబగుతో
సన్నని గొంతెత్తి, మృదుమధుర
సుధారసరాగ కీర్తనలను
ఆలపించాలని వుంది !

ముగ్ధమనోహరభావంతో
అంతర్గత సౌందర్యాన్ని
మాటలలో కెత్తాలని వుంది !

# జగన్మాత

ఆదిమధ్యాంత రహిత!
బ్రహ్మ కల్ప సంవేదిని!
నాదబిందు కళారూపిణీ!
రస స్యంద చారుహాస భాషిణీ
సుస్మేరానంద వర్షిణీ
జ్ఞాన ప్రసూనాంబికా!
ఆది మూల మంత్ర తంత్ర
యంత్రరూప ధారిణీ! అంతర్గత సంసర్గిణీ!
స్వర్గలోక సంప్రసాదనీ
భక్తిమార్గ సంప్రాప్తిణీ
ధ్యానగమ్యా మోక్షగమ్యా
జగదాంబిక జగన్మాత
జగజ్జేయ జ్ఞానధాత్రీ
పరికల్పిత పరివ్రాజిక
పంచేంద్రియ రథ చోదినీ!

## ఆదిశక్తి

ఉద్విగ్న సంలగ్న ఉత్ఫుల్ల ఉత్పలనేత్రి!
ప్రేమరసోత్కృష్ట సామ్రాజ్య రాజ్ఞీ!
సుధారస కావ్య వాక్కుతో
ద్వేగవచోల్లాస రూపిణీ
నిత్యనూతన మధుమయో
ద్వేగ సౌందర్య వాహినీ
ఆదిశక్తియు నీవే
ఆత్మ తత్త్వమునీవే
అంతర్గత బాహ్యా
భవబంధ సౌభాగ్యరాశి వీవే!

# ప్రతీక

లలిత, లలిత
భావాల సంకలిత

లలిత !
లలిత కళలకు
ఆదితాళం!

మమతల లత
అనురాగ
రాగాలొలుకు
అందాలవీణ

లలిత పలుకు
అమృతము లొలుకు
వెన్నెలలు చిలుకు

జలజపాతాలు
పూలవాన
పాల మీగడ తరగ
ఆమె మాట — ఆమె మనసు

లలిత ! చిరంజీవి
నా ఎడద మ్రోడున
చిగుర్చిన మాధవీలత!

లలిత !
నా మమతల
మాతకు ప్రతీక !

# ఆకసాన

ఆకసాన కెదిగి అవని చూచిన
నలకలాతోచు మనకంటికి
కొండలు కోనలు
ఊళ్ళు, బీళ్ళు, ఏర్లు
ఏకమై అగపడు!
నరకయాతనలన్ని
నరుని లోనే కలవు
పెద్దమనసులో
చిన్న భావాలకు
చోటన్నదేలేదు?
ఎదిగిన మనసు
ఎగబ్రాకబోదు
అవనిలో చేనికీ!
మోహపాశం కోయు
చురకత్తి పెద్దమనసు
జనుల యాతనకు
కిటుకు కనిపెట్టు పెద్దమనసు
ఉదరవేదనకన్న
ఉదార భావనమిన్న
మనసులో
ముందుకేగిన
కనగలము లోకాన్ని
కనిపెట్టగలము కనికట్టు
తొలగించుకోగలము శోకాన్ని

## ఇది

ఇది ద్విగుణీకృతోత్సాహ
సంవాహ సంరంభ శుభాభినందన వేదిక
ధర్మాధర్మ శాస్త్ర శస్త్ర మరజ్ఞుల వాటిక!

ఇది పరిణామ పరిప్లవ ఋతు చక్ర
పరిభ్రమాస్పందనో ద్వేగ శకటము:

ఇది మానవతా మణీముకురము
కవితా వసంత హేలా
వలయ విలయలయము!

ఇది అనన్యా ద్వితీయ అన్యోన్య
మౌన భావరమ్య వాగ్యుద్ధము!

ఇది మౌగ్ధ్య స్నిగ్ధ స్విన్న
నయన ప్రేమ భావన!

ఇది ఏకమౌ నాక సామ్రాజ్యానురాగ
రమ్యవనము ఇందు
త్యాగంపు పూలు పూయు

## గౌళ

చలత్ చలిత
చైతన్యోజ్జ్వలత్ జ్వాల!
మదనోద్భూత
హృదయ తాండవ హేల!
చిమ్మ చీకట్ల మానవారణ్యంపు
క్రూర మృగేంద్రియాల గోల!
మన్మథేక్షువనాన
నలు పంచక నక్కల ఊళ!
పాడేను ఈ మనసు
వేదనా భరిత కేదార గౌళ!

# సృష్టి

బ్రహ్మ చేసిన బొమ్మకు
రిమ్మ తెగులు లెన్నో!
భోగాల రోగాల
రాగాలసిగపట్ల గోత్రం:
ఇంద్రియాశ్వాలవి
నురగల పరుగులు
జగమాట! జగడాలపాట!
జీవుల జాతరలో
మర బొమ్మలన్ని
మౌనమూనే నేలో :
వడయాడు బొమ్మలు
నడకాపె నెందుకో :
చూసి నవ్వే బొమ్మ
బిర్ర బిగిసేనేలో:
బ్రహ్మ తనలో తాని
నవ్వుకొనె కసిగ
ఏ బొమ్మ ఎపుడు
ఊపిరులోసు కొనునో :
ఎపుడవి కోల్పోవునో
కనబడే ప్రకృతిలో
కనబడని శక్తేదో
కలసి తిరుగాడుటే సృష్టిగా :

# అంతరాన

అంతరాన ఏముందో
అందరికీ తెలియదులే
అందులోనె ఉన్నదిలే
అంతులేని మహిమంతా
మేల్కొన్న హృదయము
మేలిమి బంగారములే
అలజడి చెలరేపును
తేనెటీగ భావాలు
ముసురుకుని త్రాగును
మనసులోని తేనెసంతా
కళలకున్న కడలిలోతు
అందుకొనుట నీ తరమా
నా తరమా సోదరా
అంతరాన ఏముందో
అందరికీ తెలియదులే!

# మునుగీత

మునుగీతలో నీకు
బడబాగ్ని తోతెంచు
దానిలో తప్తమైతే జగతిలో పేరొంది
దేదీప్య మౌతావు
అగ్ని కాలిననీవు కాలుషాలు దరిచేర
చిరునవ్వు రువ్వుదువు
నిట్టూర్పునిగిడించి
చిత్రంగ లోకాన్నిచూసి సంతసించెదవు
లోన లోకంలోన అధిరాజు నీవులే
అంతులేని తృప్తినీదిలే!

# పంజరాన

పంజరాన చిలుకలే
మనసు జామ పండులే
మిగుల ముగ్గి ఉన్నది
ఆత్మారామాశ్రమాన యోగివర్యునెడదలో
ధ్యానమన్న మౌనమన్న
మరీ మరీ ఇష్టములే
ఉలుకులేదు పలుకులేదు
పెట్టినదే తినునులే
జాతకాలు తెలుసులే
రామకతను చెప్పునులే
మోక్షమన్న తానులే దైవమున్న తానులే
పంజరాన చిలుకలే ;

# మనసు

మనసే మనిషికి ప్రాణం!
మనసులేని మనిషి మనిషేకాదు
మనసును విరిచేయడ మంటే
మనిషిని చంపేయడమే !
తెలీని బాధేదో
మనసులోనే కద వుండేది
మౌనమైన భావాలను
అదికద మనకందించేది
మనసు మనసు కలుసుకున్న
స్వర్గం కూడా దిగదుడుపే !
విడిపోతే నరకానికి అదినడకే!
అందుకనే ఒకరి
మనసు జోలికి పోకూడదు !
పోయినచో తెలికగా చంపేయద్దు !

# ఆ వనిత

ఆ వనిత ఏరో
ఏరుపై వ్యాహ్యాళికేగ
పదిలంగ ఉండమని
పడవ నడిపేస్తోంది
ఆ వనిత ఏరో
నా కళ్ళలోకి చూసి
సింధూర తిలకాన్ని
సరిదిద్దు కుంటోంది.
ఆ వనిత ఏరో
ఒప్పుల కుప్పలా వచ్చి
చప్పున ముద్దిడమంటోంది.
ఆ వనిత ఏరో
గుండెల అద్దాన కెదురుగ
కదలక కూర్చొని
కన్నుల కాటుక సరిచేసుకుంటోంది.
ఆ వనిత ఏరో
కదలేటి ఏటును
కదలక చూద్దాము
కదలి రమ్మంటోంది.
ఆ వనిత ఏరో
పచ్చిక బీడుల కూర్చొని
పక్షుల జంటలు కదిలేటివేళ
నింగిని చూద్దాము రమ్మని
నేలను కాలితో గుచ్చి చెపుతోంది.
ఆ వనిత ఏరో !
వెన్నెలలో కురుల చిక్కులు
సరిచేసుకొనుటకు

గుండెను దువ్వేనగ చెక్కి
ఇమ్మంటోంది.
ఆ వనిత ఏరో
గుండెల తీగలను సరిచేసి
మధుర రాగాలాపన
తాను చేస్తోంది.
ఆ వనిత ఏరో
ప్రకృతే చీరగా చుట్టుకుని
మోహినిలా
నడిచెళ్ళి పోతోంది.
ఆ వనిత ఏరో !
కళ్ళముందగ పడి
అంతలో నీడై
" ఓసిపిచ్చి ! " అంచు
మాయమయ్యింది.
ఆ వనిత ఏరో
అందరిలో ఉన్నా
చూపులతో చురకేసి
ఆకట్టు కెళుతుంది
ఆ వనిత ఏరో !
రాయి రప్పను
ప్రేమయించి మనిషిగ
రమియించ సిద్ధమౌతోంది.
ఆ వనిత ఏరో !
శూన్యం లో ఫలితాన్ని
ఆశించుతోంది.
ఆ వనిత ఎరో
అంతరంగం లోన
అంతుబట్టకుంది.

# సాక్షి

ఆత్మ కన్నా సాక్షి
అవనిలో లేదు !
ఆత్మావలోకనలోనే
అంతులేని వెలుగు

ఆత్మ ఉన్న నాళ్ళే అవనిపై మనిషి
అందరిలో కలడు
ఆత్మ; అది వెతికితే
ఆత్మ జ్ఞానంతో
మనిషి మనుగడను సాగిస్తే
వెతలన్నవే లేవు

తత్కాల భావంబు తత్కాలికంబేగా!
మనిషి మనుగడకు
ఆత్మ జ్ఞానం కన్న మిన్నేది ?
క్షణికమౌ బ్రతుకున
పగలెంత ? వగలెంత ?

శాశ్వతత్వంబన్న సౌఖ్యమేలేదు!
ఐక్య భావం సున్న దేబె భావం మిన్న
ఇదేమి చోద్యమో

మట్టి బొమ్మలో కలవు
మాయలన్నీ కలసి
ఇంద్రజాలికు డెంత
నిపుణుడౌనో కాద ?

# కొరత

ఏది లేదను చింత
ఏది ఉందను రోత

ఎంత ఉన్నా
కొరత కొరతేగ

గోకిన కొద్ది దురద
కోరిన కొలది బాధ

కోరిక లన్నవి
కొరివి మంటలే

ఉన్నదేదో ఉన్నది
లేనిదేదో లేనిది

వగచిన రాదు
అరచిన పోదు

స్వాభావికం బెంత దగ్గరో
కృత్రిమం బంత దూరము

వాడికి వాడే నీకు నీవే
దేనికి అదే సరికి సరి

అదనం వదనంలో
తెలిసి పోద

అద్దంలో ప్రతిబింబం
అన్నీ చెప్పును నీతో

ఏది లేదను చింత
ఏది ఉందను రోత

బయట పల్లకిమోత
ఇంట్లో ఈగల రోత

# చైతన్యం

చైతన్యం పై
సర్వమదిమి పట్టా!

గర్వం వదలి మర్మం ఎరిగి
మౌనంగా నేనున్నా
మనోబలం! దైవబలం!
అన్నీ నాలోనే,

అగ్ని జ్వాలగమార
చైతన్యంపై
సర్వమదిమిపట్టా!

గిర్రున తిరిగే విశ్వగోళం
కన్నుల్లోనే వుంది!

ప్రత్యణువును
పరమాత్మగ భావించా!

అణు విక్షేపణ
మనసున కావించా!

భావాలన్ని భస్మంబై
ఆలోచనలను ఆపేసా!

నడిచే నడకలో
లోకం అడుగును కొలిచా!

బలినినేకాదు
బలిపశువును ఈ లోకానికి

పరమాత్మను పరలోకానికి
జీవికి శిక్ష ఈ జన్మని తలచా!

# నిశీధి కన్య

నా కున్నది
ఒక అపురూప హృదయం!
దాని కున్నవి
వేన వేల భావాలు

ప్రకృతిని పట్టుకుంచెతో
చిత్రించాలని, పరుగులెత్తే
సెలయేళ్ళ ప్రవాహంలో
తేలియాడాలని

నిశీధి కన్యనై
నిశ్శబ్ద గీతాల నాలకించాలని

శిలా సదృశంగా
మిగిలిపోయిన శిల్పాలలో
జీవకళ తట్టిలేపాలని

వెండి అంచుకట్టి
వెలిగి పోతున్న
ఆకాశం తాకాలని

నిర్వికారంగ సాగుతున్న
రవిచంద్రుల పలుకరించాలని
వొయ్యారపు మలయానిలాన్ని
వొడిసి పట్టి ముద్దిడాలని

నాకున్నదొక
అపురూప హృదయం!
దాని కున్నవి వేన వేల భావాలు!

## తెరపు

వ్యామోహపు మబ్బులలుముకున్న
ఆకాశంలా ఉంది హృదయం!
దూది పింజలల్లే భావాల మేఘాలు
అటు నిటు కదులుతున్నాయి,
ఆత్మ సూర్యబింబం !
అవిచ్ఛిన్నంగ వెలుగుతోంది!
అద్భుతమైన కాంతి పుంజాలు
మబ్బుల్లోంచి దోబూచులు!
ఫెళ పెళార్భటులతో
మేఘాలు గర్జిస్తున్నాయి!
మేధస్సులోని ఆలోచనా విద్యుల్లతలు
అటు నిటు పరుగులు !
బుద్ధి కౌంచీ ఝళిపిస్తున్నట్లు
కాసేపటికి కన్నీటి వర్షంతో
హృదయాకాశం తెరిపిగా నిర్మలంగా వుంది !

## ఒంటెద్దు

బ్రతుకు నిమ్నోన్నతాల మధ్య
మనసు ఒంటెద్దు
జీవితం బండి లాగలేక వాగురుస్తోంది !
ఐనా నిముషమాగ కుండానే నడుస్తోంది !
ఇంకా ఇంకా నడువమని
పరిస్థితుల మునగాల కఱ్ఱ పుచ్చుకుని
విధి కర్కశంగ తోలు తుంటే
లాగలేక తూలి క్రింద పడుతోంది !
తిరిగి లేచి గమ్యం
చేరువలోనే వుందన్న ఆశతో
గమనం సాగిస్తూనేవుంది.

# గవాక్షం

అచేతన నా వర్తు
ప్రపంచంలోంచి
చేతనావర్తు లోకంలోకి పోయి
వర్తులా కారంగ భ్రమించే
ఆలోచనా తరంగాల్ని
అక్షర తోరణాలుగా
నా మనోగవాక్షాలకు కట్టాను।

నా జీవితానుభవ
మధుర క్షణికాలను
మరువ లేకున్నాను

క్షణం! క్షణం!
ఆశా నిరాశలను
మోయలేని
ఈ బ్రతుకు భారాన్ని ఎలా భరించేది?

గడచిన అనుభవాలకు
భవనాలు కట్టాలో!
వర్తమాన విషాద జీవనవనంలో!
దిక్కు తెలీని పక్షిలా తిరుగాడాలో!
భవిష్య దూహామయ
ఆశాదోలికలలో ఊగాడాలో!
తెలియటంలేదు! కలియటంలేదు।

నా జీవితంలో
ఒక ఆలోచనకు మరో ఆలోచన।

# కవి

కవి గళమ్ములోన కలవు
కరుణార్ద్ర గీతికలెన్నో!
అతని ఎడందలో
పొంగి ప్రవహించు
నిత్య మమృతరసము॥

అతని ఊహ అతనికి
అపరిమితానంద సౌఖ్యమ్ము!
జగతి శ్రేయము కోరి
సృష్టికే ప్రతి సృష్టిసల్పు
అతని ప్రతిభ! అతని ఊహ॥
బ్రహ్మానంద సబ్రహ్మ
పరిధి దాటిపోవు- అతని
దృష్టికి రాని వస్తువన్నది లేదు
ఊహకందని విషయమే లేదు

కృతిసేయు వేళ ప్రసవమ్ము వోలె
భావమ్ము భాషయు కలసిరాగ
ప్రకృతి వికృతుల్ ఆకృతిగ వెలసి
రసవంతమౌ కైత!

ఎట్టి ఊహకునైన
ప్రాణంబు పోయు
ప్రాణంబులీయు
తోచినదల్ల కవితకాదు
వ్రాసినదల్ల కావ్యమ్ము కాదు
తాను తానైన వేళ
తందాన తానంచు

భావాలు వచ్చి భాషగమారి
కలకండలచ్చులై
కావ్యాల మాలలై
వేదనా వాదనల వేదమై
నాదమై లోకంపు శ్రేయమ్ము
చేకూర్చు కవిత
రసవంతమౌ భావనలు
పెట్టి పుట్టినవాడే కవితలల్లగగలడు
కవియన్నదేదో కనబడని మాట
కవితన్నదేదో తీయని మధురిమ
ఆకలా? దాహమా?
చింతలా? వంతలా?
మంచి కవితను చదువ
కడుపంత నిండదా?
మనసంత పండదా?

## లయ

లయ! శబ్దాలలో లయ!
శతాబ్దాలలోలయ! గాలిలో లయ!
ప్రేయసి కనులోయలో లయ
సాహిత్యంలో లయ! సంగీతంలో లయ!
శిల్పంలోలయ! చిత్రంలో లయ
అన్ని జీవరాసుల కన్నుల్లో లయ
అణువణువున లయ
కరుణనాటిన కన్నతల్లి చూపుల్లో లయ
ఆప్యాయత నిండిన
మనుష్యుల మమతల్లో లయ
అనురాగం నిండిన గొంతుల్లో లయ!

# పగిలిన అద్దం

తెలి తారకల మబ్బు
నీటిలో తేలుతు తన
అందచందాలు తానె చూపింది
అంతలోనె తాను
పొరబడితిననుకొంచు
తత్తర పాటుతో
తన నీడనే తానుకాదు పొమ్మంది:
మాయకేనేనేమో మాట కాదందామె
మమత కాదనలేక తనలోనె తానెంతొ
కుమిలి పోయింది!

మంచి మరువనులేక మనసు నిచ్చింది!
మనసు మరిచెదనంచు నేనన్నంతలోనే
తనలోనె తానెంతో బెదురు చెందింది
అదరిపోయే మాట అదనుచూసి
నాదు ఎదను వేసింది

దానితో ఆమె యే మాయంచు
నేను వెతను చెందాను
వెతలేన మిగలేది? ఈ జగతిలోన
కైతగా మిగిలింద? ఈనాటికీ బ్రతుకు:
అతకలేనట్లుగ పగిలింది
ఈ గుండె అద్దము చిట్లిన పెంకులలో
ఆమె కన్పించింది ఆమెతో నాకున్న
ఆనందమదినే కోరనే లేదు
కోరికే మనిషిగ తను తానె తలచెనేమో!

## మక్షిక

అనువంశిక పరిశీలనః ఆత్మానందపు సంశీలన!
ఈజీవిత సంశోధనలో సిద్ధాంతలై వెల్వడుటకు
నువు చేయాలొక కృషి ఋషిలాః
ఆర్షంః హైందవ సమాజానికది హర్షంః
సహజంగా అది మనలో అనుకోకుండానే వర్షంః

చిటుకు పాటి ఈ జీవిత ఉద్గ్రంథం!
చిటపట చినుకులతో చీకనీకు
చీకాకుగ జీవితాన్ని గడుపబోకు
ఆత్మానందంబతి సూక్ష్మంబని తెలుసుకో
ఈ జీపితమది శ్లేష్మంలో మక్షిక

## ఊహ

నానర నరంలో
నర్తిస్తోందో గుహ్యమైన ఊహ
అనూహ్యవేదన భరిస్తోంది
గహనమైన ఈ హృదయంః
నిరంతరం ఘోషించే నీరనిధి
నాకత్యంత అందమైన ప్రతినిధిః

ఊహకందనిది ఊహించే హక్కు
వశం చేసుకున్న నేను ప్రతివారికిచిక్కు!
విషాదాంత విషపూరిత జీవితరంగం
పతనోత్పతిత ఆశా మోహపు చదరంగం!
మేఘోద్భాసిత విద్యుల్లతా సదృశం!
హఠాత్ జీవనోద్ధృత అదృష్ట దీపిక!
దిము దిమ్మను అవాద్యపు మద్దెలనాదం
ఈ హృదయపు నిరంతర మధనంః

# అడుగుజాడ !

సూర్యోదయ సుప్రశాంత సంధ్యవేళ
అలసి సొలసి నిజజీవిత పాంథుడొకడు:
నవోన్మేష ప్రకృతిలో తన్మయించి
సాగర తీరంలో మెలమెల్లగ నడువసాగె:
అడుగడుగులోన
తన పాపంబు కడగుకొనుచు
కనబడని ప్రభువొకడు తోడునీడై కదలిరాగ
రెండు జతల అడుగులవి
పులినతలమున ప్రకటీభూతమైనిల్చె
స్రష్ట తోడిదె సృష్టికదా
దీనపాంథుడు వెతలతో విసుగొంది
బాధలతో బ్రతుకుచు
పోరాడి ఓడిపోయె:
కన్నీటి కెరటాలు పొగిలి ప్రవహింప
గర్భాన కడలిదాచుకు
భారంగ నడువసాగె నతడు
అడుగు ప్రక్కనే అడుగు
రెండుజతల అడుగులవి:
కొంతదూరమేగి జాడ
కానరావు కొన్నిచోట్ల
"స్వామీ: ఇదియేమని?"
మనసులోని ప్రభువు నడిగె పాంథుడు
చిరునవ్వు లెగజిమ్ముచు
కరుణారసమది కన్నులలో చిప్పిల
జ్ఞానభాను రేఖలతో
వెల్గొందే ప్రభువిట్లనె

"నీ పజ్జనె నేనుంటిని
నీ వాజ్జను నేనేగా
నేను లేని నీ వేడ?

నిను రక్షించే బాధ్యత
నాదేగా। "నను" నమ్మిన
నీ జీవనయానంలో
ఒడి దుడుకులు కానరావు।

చీకటి వెలుగులలో
తోడు నీడ నేనౌదును

అండదండ నేనుండ
నీకేలచింత ?

పున్నమి వెన్నెల నీ బ్రతుకు
నాతో పయినించేవేళ కష్టాలలో
చంకనెత్తి లాలించితి కొన్నిచోట్ల
అడుగుజాడ లొకటిగ

అందువల్ల నీకు తోచె
ఆ అడుగులు నావే।

నీ బాధ్యత నాదే।
నీ నడకలో

తడబాటది ఎదురైతే
నేనుందును నీ నీడగ

పొరపాటది సహజమురా
కడిగేయుము కన్నీటితో

నీ కోసమె నేనుంటిని"
అని ప్రభువని పతితునితో

# ఒక కవిత

కవితొకటి వ్రాస్తాను
ఆకమనీయ సుధాగాన
మంజు వాటికలో నేగానకచేరీ చేస్తాను

చిరుగాలికి మెదిలే
నా హృదయ వీణాతంత్రుల్ని
లయబద్ధంగా నా చేతనైన రీతిలో మీటుతాను

నా మౌనాన్ని ధ్యానంతో
కవితోద్యాన వనంగ మారుస్తాను
నే రసపారవశ్యంతో ప్రత్యక్షమవును

రమ్యంగా భావించే కవివర్యుణ్ణి
ఏదెసలో నాభావనలు సంచలిస్తాయో
అక్కడ నవ్వుల్ల పూల వర్షం కురుస్తుంది

భూమ్యాకాశాలు ఆనందంతో చుంబించుకుని
పచ్చని పంటచేలను ప్రసాదిస్తాయి
పసుపు పారాణులతో
పేరంటాండ్రు మంగళారతులు పాడుతారు
ప్రకృతి పరవశించి పులకిస్తుంది

అందుకనే అమలిన మనస్కతతో
కవితొకటి వ్రాస్తాను
ఆ కమనీయ సుధాగాన మంజువాటికలో
నే గానకచేరీ చేస్తాను !

# అనోశ్రీన్యా!

నీముని వ్రేళ్ళతో నా ముంగురులను
సరిచేసినపుడు రస స్పందనతో
నామనసువిఝ్ఝూరింది
నీ కురుల విరజాజులు
నే తురిమినపుడు ఈలోకాన్ని
తరిమి తరిమి కొట్టాలనిపించింది.
నీ కాటుక కనుల
జాలు వారిన క్రీగంటి చూపు
ప్రేమామృతమై నా బ్రతుకులో
పండు వెన్నెల కురిసింది
నా మనసులో ఆకలి
నీ రూపాన్ని కోరికోరి తింటుంది
ఆ పిదప గంగిగోవులా
నేమరేసుకుంటుంది
నీ పాపట తిలకంగ తీర్చిన నా ప్రేమ
ఎంత తీర్చుకున్నా తీరనిది
నీ కాలి పారాణిలా ఆరనిది
నిన్ను తప్ప వేరేమి కోరనిది
నీ పరోక్షంలో అంతర్గత సౌందర్యాన్ని,
ప్రత్యక్షాను భవంగ
నీ ఊసులతో, ఊహలతో
ఈ మనసును ఊరట పరుస్తాను
నీ నా భేదమేల? సమస్తం మనమైన కళ
మస్తకానెత్తుకుని ప్రేమగర్వంతో
ఈలోకాన్ని జయించడమే నీవు నాకు నేర్పింది
చెరగని చిరునవ్వే
నీవు నాకిచ్చిన కానుక

# జీవితం

ప్రమాదకరం ! ప్రమోదకరం !
ఈ జీవితమది అంతర్భావితం !
అంతర్బహిర్లోకాల కదలికలు
అంతరాంతరాల్లో ప్రతి ధ్వనిస్తూ
నడుస్తుందెపుడు జడుస్తుంది!
వ్యక్తిగా బ్రతకినపుడు
జడిపిస్తుంది వ్యక్తిగా బ్రతకనపుడు
మంచితనం ముందుంటే
సంచిత ప్రారబ్ధం ఆ తర్వాత
తన్నుకు వచ్చినా ఈ జీవితంతో
సంబంధం అనుబంధం నీకొద్దు
సమస్యల్లో విమనస్కుడవవక
సంస్కారం సమభావం నీ భావనగా
కష్టాలలో కృంగక, ఇష్టాలలో పొంగక
మమకారం అన్నిటిపై ఉంచక
అంటీ అంటని విధంగ గెంటుకురా !
జీవితాన్ని! జీవితమతి జాగ్రత్త
ప్రమాదకరం! ప్రమోదకరం!

# అప్పగింత

కన్నకొడుకు ఇంటివద్ద
ముసలి ఒకడు చావబోతు
వణకుతున్న వ్రేళ్ళతో
విల్లుమీద ఇల్లు వ్రాసి
కళ్ళ ఎదుట కనబడే
బీరువాను బాధతోటి
తేరిపార చూచిచూచి
అబ్బాయి! అట్టడుగున
డబ్బుంది! ఆఅడుగునే
సొరుగులోన నోట్లున్నాయి,
దహన ఖర్చు లోటులేదు
కట్టెలన్ని కొట్టించి అటకమీద పెట్టించా
లోటులేదు మీకు గానీ....
బ్రతుకబాట జాగ్రత్త!
తెలివి తక్కువ కనిపిస్తే ఆట కట్టి ఆడిస్తారు
సభ్యతయే కొరవడితే
పరపతినే కోల్పోతావు
ఇంటిగుట్టు లంకచేటు!
ఉన్న తిన్న పరుసకసలు
తెలియనీక తెలివితో గుట్టుగా గుప్పెట్లో
జీవితాన్ని పెట్టుకొని బత్రకమంటు
అప్పగింత పూర్తి చేసి
ఆఖరిగా అమ్మమాత్రం
జాగ్రత్త! జాగ్రత్త!
అంటూనే కంటి నీరు తుడుచుకుంటు
అంతలోనె చచ్చిపోయె; ముసలియతడు

# సిరిమల్లె

ఊగిపోయే మనసు
ఆగిపోయెనేలో!
కూనిరాగం గొంతు
కిక్కురు మనదేలో
చిలిపి కన్నులనీరు
చిప్పిల్లిన దేలో
ఇల్లంత తిరుగుతు
గంతులేసేపిల్ల
పిల్లి అయి పోయే నేలో
మగని రాకతో
మగువ మనసు
సిగ్గొచ్చి మొగ్గయి
తల్లి చాటుకు బోయి
తల్లడిల్లేనేలో ?
సిరిమల్లె అల్లే!
చిరునవ్వే రువ్వి
మనసంతా
మమతారాగం పలుక
ఇంపగు మోముతో
కెంపులొలికేనేలో
చినదాని డెందంలో
తన వాడొచ్చేనని
అందాల భావాలు
తందాన తానంచు
చిందేసే నేలో!

## ప్రత్యర్థి

నా హృదయం సంద్రమంత పెద్దది!
వద్దన్నా భావతరంగాలు వెల్వడతాయి;
సంద్రపు నీరులా నా భావాలు ఏ తెంచేది
చెలియలి కట్టదాకానే
భావం గర్జిస్తు ముందుకు
భాష సంద్రపు ఘోష
ప్రతి భావతరంగం హృదయాన్ని స్పృశిస్తుంది
ఎగిరి ఎగిరి అందని దానికోసం
ఎగిరి ఎగిరి ఆశిస్తుంది!
అనవసరంగా ఎన్నో మార్లు
ఎన్నో విషయాలను అనుమతి లేకనే శాసిస్తుంది
నిశ్వసిస్తాను నేను దాని అమాయకతనుచూసి
ఆగిపోయే వరకు అదినాకు ప్రత్యర్థి

## ఆభరణం

భ్రూమధ్యరేఖ భ్రుకుటిలోంచి
పరుగెట్టింది!
బంగాళాఖాతం రసబంధురమై
ఎడదగా మారింది!
ఆకాశం నాకోసం
ఆకాంక్షగ చూస్తోంది
భూభామిని ఈ కాయాన్ని
బలవంతంగ ప్రేమిస్తోంది!
ఋణాంతం! మరణం!
బ్రతుకే ఓ ఆభరణం!

# బజ్జీ!

దివాళాలోకం : దేశవాళీ
మిరపకాయ బజ్జీలాంటిది!

గజ్జి కుక్క లాంటి
ఈ మనసుకు జిలెక్కువ!

చంటిపిల్లాడిలా
ఈ లోకం అపరిశుద్ధాన్ని
తెగ పులుము కోకు!

కుండలో తంపబేయకు
తెలివి తేటల తేగల్ని

చందమామ కొస
కొరుక్కుంటు తెగ నీల్గకు
బుద్ధి మందగిస్తుంది

కారా కిళ్ళీలా
నమిలి ఉమ్మేయ్!
పరిస్థితుల ఉద్రికతను

అద్వితీయానందంతో
లోకం ధాటిని తట్టుకొని
బ్రహ్మానంద సబ్రహ్మ పరిధి దాటిపో!

ఈ దివాళా లోకం
దేశవాళీ మిరపకాయ బజ్జీలాంటిది!

## ఆశల కుంపటి

గూటిలో దీపం కొండెక్కుదాక
ఆశల కుంపటి చల్లారదాయె!
తెల్లారి బ్రతుకంత తెలివి తప్పేదాక
వేదాంత భావనే రుచియింపదాయె
ఊశుని ఊసులు ఊపిరాడుదాక
ఉచ్చరింపరాద?
దీపమున్నపుడే ఇలు సర్దరాద!
చీకట్లగోలేల?
ఇంద్రియోద్వేగంపు గాధేల?
బాధేల? వల్లమాలిన బ్రతుకుకు
కనుగోరాద రాదారేదో!

## ఆత్రం

మనసుకు ఆత్రం!
మనిషికి స్తోత్రం!
బ్రతుకో యంత్రం!
బాధేమంత్రం!
రోజే తంత్రం
రాజు కుతంత్రం!
లోకం కంత్రీ శోకం భజంత్రీ!
మాయ యాత్ర మట్టిజాత్ర!
నీవు మాత్రం నిక్కమేరా
కాటి కెళ్ళడం
వచ్చి పోయే వేళలో
ఒంటరి నీవు తుంటరి తనమేలా ?

# యవనిక

ఈనాటికి ఈనాటకానికిక
యవనిక జారుతోందేమో

ఈలోకాన్నుంచి మరో విషాద లోకాన్ని
వెతుక్కొంటూ వెళ్ళుతున్నానేమో
తెలియని ఈలోకంలో కదిలే ఈకాలంలో
అంతాతెలీనట్లే ఉంది

తెలియని దాన్ని తెలుసుకోవాలన్న
పట్టుదలే నశిస్తోంది

ఆధ్యాత్మిక జిజ్ఞాసతో
ఈలోకం చికాకులన్నీ తొలగించుకుని
ఆత్మ విశ్వాసంతో ముందడగువేసి

చీకూచింత లేని ప్రశాంత జీవితాన్ని
గడపాలనివుంది దివ్యకాంతితో
వెల్గొందాలని వుంది

# తేజం

ఉపసనోత్సాకాన
అంతరంగంలోన
దివ్యతేజం చూడ

అద్భుతాలెన్నెన్నో
బుద్బుదాలుగ తోచె.

కాలవాహినిలోన
తల్లి మంజీర నాదాలు
గలగల వినిపించె!

## కోకిల

గున్నమావిపై వసంత కోకిల
ఉగాది గీతం పాడింది
ఏదో విషాద భావం సంధ్యవేళలో తోచింది
ప్రకృతి ధర్మం; వికృతి మర్మం
అంతర్మథనం ఆకృతి కర్మం
ప్రకృతి పురుషుల ప్రణయంలోనే సృష్టి
అదే ఈత్కాలికమౌ పుష్టి
ప్రకృతి ఆగ్రహిస్తే ప్రళయం
అనుగ్రహిస్తే ప్రణయం
ప్రతి మనసున ఓ ఆకృతి
ఆ ఆకృతిలో
ప్రణయం - ప్రళయం - ప్రణవం
గున్న మావిపై వసంత కోకిల
ఉగాది గీతం పాడింది

## ఎక్కడ

కష్ట జీవికి కాళ్లమెక్కడ?
నష్టజీవికి మార్గమేది?
భ్రష్టమైలోక మ్మఁడగ
భ్రష్టులంతా రాజ్యమేలగ
వ్యష్టి భావం పాడుకొనగ
సమిష్టి భావం చేదు అవగ
చేదుకోడమె ధనం ధనం, ధనంతోనె లోకమున్నది
జనంలోన, ధనం వున్నది కొద్ది మందికే
ధనం కోసం, పరుగులెత్తగ, నీతి ఎక్కడ?
ధర్మ మార్గం మంటకలిపే
రాచకార్యాల్ పెచ్చు పెరుగగ
మంచి కోరే వెఱ్ఱివార్లల్ కవులు కారో!

# సైకిలు

కష్ట సుఖాలు సైకిలు చక్రాలు
బుద్ధి హ్యాండిలు మనసు సీటు
గుండెల గంట ఎంత కొట్టినా
తప్పుకోరు
ఎంత త్రొక్కినా గమ్యంరాదు
మిట్ట పల్లాలలో వొగర్పు ఆయాసం
సంతోషం: సంభ్రమం:
కష్టాల్లోనే కనిపిస్తాడు దేవుడు
డైనమో లేని సైకిలు
డేంజరు లైటు వెల్గదు
నడి వేసవిలో
లోకం నడిరోడ్డుపై
బ్రతుకు బరస్టు
ఉన్నట్టుండి పడన్గా
గాలి పోతుంది అపుడపుడు
ఈ హృదయం ట్యూబ్‌కి
గాలికొట్టే మిత్రుడే వుండడు
పంపున్నా పట్టుకునే
నాధుడే లేడు
గాలి ఉన్నపుడు ప్రతివాడు
ఎక్కుతాడు సైకిలుపై
కాని నేనే వొగర్చుకుంటు త్రొక్కాలి
నాగాలి నేనే కొట్టుకోవాలి
నా బ్రతుకు సైకిలు నేనే
నడుపుకోవాలి భారంగ

# ఎవ్వరో

నా ఖడ్గంలో నున్న రక్తాన్ని
జుర్రున జుర్రేస్తున్నారు
రాక్షసులెవర్లో!
నా హృది చీల్చి కాల్చి
మద్యంతో కలిపి మత్తుగా
నంజుకుంటున్నారెవరో
నా నర నరం త్రెంచి
కరతలంలో నుంచి
నిశితంగ పరిశీలించేస్తున్నారెవరో

నా మేధస్సులోని
గదులన్ని తెరచి తలపులు
బద్దలు కొట్టేస్తున్నారెవరో!
నా రెండు కళ్ళు తీసి
గాజు గోళీల్లా ఆడుకుంటున్నారు
క్రూరులెవరో
నా గుండెకు పిస్తోళ్ళను గురిచేసి
చంపేస్తున్నారెవరో
నా దిగుడు బావిలోంచి
దేహంలోకి నెమ్మది నెమ్మదిగ
దిగివస్తున్నారెవరో,
నా ప్రత్యంగమూ పీరచి
రక్తంతో తడిపేర
నిర్దాక్షిణ్యంగ కోసేస్తున్నారెవరో
నా కన్నీరు పన్నీరుగా
జల్లుకుంటున్నారు కిరాతకులెవరో

# ప్రణవం

ఓంకారంబది ప్రణవంబే!
"ఓం! నమశ్శివాయ !" అన్న
యోగం! ధ్యానం ప్రణవంలోనే

ప్రాణాయామమున
ప్రణవనాదమును
మార్మోగించిన
ఎల్లలోకములు దద్దరిల్లును

ఎల్లలులేని ఆనందంతో
ఉల్లమంతయు తల్లడిల్లును

జీవన్ముక్తికి జీవశక్తికి
శాంతికి, దాంతికి
ప్రణవంబే
ప్రాణాధారం

ప్రాణం ప్రణవంబైన
ఉద్విగ్నంబగు
ఆత్మశక్తికి ఎదురేలేదు!

బాహ్యాభ్యంతర
దృశ్య బంధములు
మనో ప్రపంచమున

నాశనమయ్యే
సుస్థిర శాంతితో
చేదు భావములు తొలగి పోవును

# హంస

కొలనులోని హంస!
నడచిరా నెమ్మదిగ
నాకడకు! నాకడకు!
చల్లని వెన్నెలలో భావాల సరసిలో
ఓలలాడే హంస!
వన్నె చిన్నెలు చిందు
ఓ చిన్ని హంస!
లోలోని లోపాలు
తెలియజేసే హంస!
దరి జేర రారమ్మ?
రావమ్మ! నీకేల?
అలుక నెలవంక
నలునితో ఏమేమి మాటలాడితివో
బుద్ధునితో ఏ రీతి లాలింప బడితివో!
చిన్నవౌ అడుగులతో
తియ్యని నుడులతో
నా ఎడద చల్లార్చ నాకు తోడుగ నిల్వ
నడచిరా నా కడకు ఓ రాజహంస!
నీ మానస మందు ఏమున్నదో చెప్పు
నీ మేని రంగులు చూసి
పొంగి పొరలెను ఎడద
నీ నడకలందము చూసి
నాట్యమాడెను ఎడద
నడచిరా! నడచిరా!
నా కడకు! నా కడకు!
వన్నె చిన్నెలు చిందు ఓ రాజహంస!

# శివా!

శివా! నీ నిటలాగ్నితో
నా వ్యామోహ దృగ్వల్లరులను
భస్మీభూతంచేయి
శివా! నీ గంగా జలంతో
నాలో కశ్మలాన్ని ప్రక్షాళన చేయి
శివా! నీ విభూతి రేఖలు
నా నుదుటిపై వెల్గొందగ
ఇహలోక వేదనల్ని తుడిచేయి
శివా! నీ కాలకూట
విషాన్ని నా అంతర్గత విషంతో కలిపి
అనామయునిగ చేయి

# అగ్ని

అగ్నిలో
దహనం చెందబోయే
నేను దాహ భంగిమలెన్ని
చూపుతానో కదా!

మట్టిలో కలవబోయే నేను
రొట్టె విరిగి నేతిలో
పడ్డట్టు ఎంత సంబరపడతానో

గాలి మట్టి కలసి
కొత్త కతలెన్ని చెపుతాయో!
వలువలూడ్చిన భావాల్
రాకపోకలలోని రమ్యాన్ని చూపాయి!

ఏడ కెళతాయో ఈ ఆశలన్ని
ఏడకెళతాడో! ఈమనిషి ఇందర్నివీడి!

# చేదుబువ్వ

కటిక చీకట్ల
కలువ నొల్లదీ మనసు!
విద్వేషంపు విషపు
జల్లులు కురిపించు
నిర్గంధ కుసుమమీవు!
కారుమబ్బుల దొంతరలు వోలె
తొందరలు పెట్టి
మదిని వ్యామోహ కూపాన
పడవేయుదేల? గబగబ పొమ్ము
ఉరుము, మెఱపుల ఫెళ ఫెళార్భటుల
నన్ను లోబర్చుకోలేవు
కాంక్షాగ్ని కణముల
ఎడద కుంపటిన
చలికాచు కుందువేల?
విషపు నవ్వు రువ్వి
దువ్వుదేల? కాలు సేల గ్రుచ్చి
కామోద్రేకిత భావనల
నన్ను చిన్న బుచ్చుదేల?
వసివాడు నీ విరుల
కురులు; నాకురులు కావే?
నిర్జీవిపై మరులేల?
మరలేల నన్ను మరిగి త్రిరిగి చూతువు
చేదుబువ్వ.
ముద్దు మురిపాల
కోరి యెవ్వడారగించు?

# వ్యత్యాస్తం

ఏది కాలకూట
విషమో దాన్నే దిగమ్రింగు
ఏది విషాదవద
సంఘట్టనమో దాన్నే కోరుకో!
ఏది వేదనోద్వేగ
భరితమో దాన్నే అనుభవించు
కష్టాల కాష్టాల కాలిపో!
ఓరబ్బీ! నష్టాల భ్రష్టాల బాటలో నడిచిపో!
బ్రతుకు నిమ్నోన్నతాల మధ్య నలిగిపో
త్రిశంకు స్వర్గంలో నిల్చుని
సమస్యల ఊయలలో
మనస్సు నల్లలాడించు
జనన మరణాల జాత కాలు వల్లించు
పల్లవి కనుపల్లవి మేళవించి
అపశ్రుతుల, అపభ్రంశాల
కఠోర కంటక మార్గానే నడచిపో!
గుండె గుడి గంటలు మ్రోగిస్తూ
"శివోఽహం సోఽహం దాసోఽహం!
నమో నారాయణాయ!"
అని జపిస్తూ, తపిస్తూ
రమించు మనసుతో
భ్రమరా బ్రతుకంటే అని
నీవే చెబుతావు జోరీగలా
చెవులో రొద చేస్తూ!

## లలిత

పరికల్పనా
సమాగమోద్వేగ
సమున్మీల శక్తి!

అద్వితీయ
ప్రభావోన్మేష
సమున్ముద్ర!

బీజాక్షరీ
మంత్ర సంపన్న
హృదయ సంవాసి!

భ్రూనాడీ
స్పందనో ద్వేగ
ఆనంద జగదధిష్ఠాన దేవతామె
సహస్రా సార ధ్యాన సంలగ్న
చిదానంద రూపిణి
త్రిమూర్తులను కన్నతల్లి
లలిత మా అమ్మ
లలిత కళా
రసస్విన్న నయన

భక్తి ముక్తి ప్రదాత
అఖిలాండ బ్రహ్మాండ
సుస్మేర! సుస్నేహ!

అంతర్వర్తి నామె!
అనిర్వాచ్య
మామె మహిమ

# నీవే తల్లి!

నీవే తల్లీ ఈ లోకం!
నీదేనమ్మా జగమంతా
కన్న తల్లివి నీవేనమ్మా
కనిపెట్టి మముచూడు
అనిపెద్ది వారమమ్మా
ఎల్లారి తల్లివి నీవు
ఎల్లరి తల్లివి నీవేనమ్మా
ఉల్లంబంతా నీదే నీదే
ఉరకలు, పరుగులు దేనికో
ఊగిసలాట దేనికో
నీ ఏలుబడిలో నాకు
ఈ గుండె గుడి దీపం
రెపరెపలాడుటేలనో
తడబాటు నాకులేదు
తల్లీ! శరణు నీవేనంటి
చల్లని తల్లివి నీవేనమ్మా
నీ పాద పుష్పంనేను
కైవల్య పదము చేర్చు
కోరికలన్ని కాల్చేసి
ఆత్మీయ భావం నిల్పు
అనోన్య మార్గం తెల్పు
అజ్ఞానిని నేనమ్మా
ఎందులకమ్మా నాకీ జన్మ?
నిను కొలిచే దారేలేదా?
అమ్మా! అని పిలువ
నోరేరాద? మనసే పోద

# నాటకం

బాజా కొడితే గాని
బ్రతుకు గడవదుగ!
బాకా ఊదితే గాని
మనసు కోరిక తీరదుగ

బాధ లేకుండా
జీవితం నడవదు!

స్వాభిమానం చోటులో
ద్వేషం రాజ్యమేలుతోంది

సంతోషం గుప్పెట్లో
దుఃఖం దాగుంటోంది

అనుమానం అవమానం!
సహజమై పోయాయి
మనసులో భయం
దిక్కులు చూస్తోంది
అవసరం
ఊడిగం చేయిస్తోంది

పెదాలపై తెచ్చి పెట్టుకో
చిరుదరహాసం

బ్రతుకులో
నటించడంకన్న
హేయమేముంది ఈ లోకంలో

# చిన్నోడ!

ఎలుగెత్తి చాటరో చిన్నోడ !
దేశ ఔన్నత్యాన్ని
గతమెంతో ఘన కీర్తి కలవాడ !
జనమంత జేరి జేజేలు పలికారు !
జాతిజెండా నీకు స్ఫూర్తి నిచ్చేను
జాతీయగీతం గొంతెత్తి పాడు
జాతిపితనే మరువబోకు
ఈ దేశ సంస్కృతిని
దేశ దేశాలన్ని బాగుబాగనెను
కర్మ భూమిది; ధర్మ భూమి, కళలక్కు కాణాచి
వేదాల శాస్త్రాల పుట్టినిల్లి దియే!
దివ్య భాగ్యోన్నతితో
వర్ధిల్లు భావిపౌరుడవంటే నీవేరా!
అగ్ర రాజ్యాలన్నె అన్ని రంగాల ఆరితేరాలి
అన్నదమ్ముల వోలె చేదండ బూని
ఏక గొంతుతో సమైక్యగీతం పాడి తీరాలి
పెద్ద దేశము మనది పెద్ద మనసుంచాలి
పేద దేశము మనది త్యాగ ధనమును పంచాలి
దేశద్రోహం, ఉగ్రవాదం!
మత విద్వేషం! మాయని మచ్చ!
మానవత్వపు కంచునగారా
విరామమెరుగక మ్రోగిస్తూ
దిగ్విజయ భేరిని సంరావిస్తూ
హృదయ హిమనగ మెక్కి
ప్రేమంపు పూతే మహినంత జల్లు
అందలాలకటే! అందలచటికే!
ఊపిరాడే దాక నీవు
జనం పాటే పాడరో చిన్నన్నా!
జనం బాటేనడవరో !

## సోమరి

సరిహద్దుల్లో రాత్రిం బగళ్ళు శ్రమిస్తే
నిద్రో కలుగు తున్నావు భద్రదంగ; ఇంట్లో
పొలాల్లో రైతన్నలు చెమటోడ్చి
పంటలు పండిస్తే
తింటున్నావు ముప్పొద్దుల !
కర్మాగారాల్లో కార్మికులు
చేతులు కదుములు కట్టేలా కష్టిస్తే
బ్రతుకు తున్నావు పేషన్‌గా
దేశాభివృద్ధికి
నీ కృషినువు చేస్తున్నావా ?
ఆలోచించావా ? ఎన్నడైనా
వాళ్ళు సుఖంగా వుండాలని

## అన్నా!

అన్నా! శాంతి వచనం పలుకరా !
శాంతిగీతం పాడరా ! క్రాంతిలోకం నడవరా
మురికిలోకపు కట్టుబాట్లను
మట్టి కలిపే మంచి కవితను చెప్పరా !
మంచితనం, మానవత్త్వం పెంచుకొని
కులమతాలను విస్మరించి, కుళ్ళు భావల్ కోసివేసి
మానవతే మన హద్దుగ దానవతను రద్దు చేయగ
ప్రగతి పథమున జనం
భుజం, భుజం, కలిపి నడవగ
కవిత వ్రాయర ;అన్నా !
శాంతి వచనం పలుకరా! కాంతిగీతం పాడరా!

# బొంగరం

ధరాతలం! గిగిరర
గిర్రు గిర్రున తిరుగాడింది!
రంగు రంగుల
రంగుల లోకం
చెంగు చెంగున
హంగు పొంగుల గంతులేసెను!
లేగ దూడలా
లేడి పిల్లలా
మనసు నెమలియై
పురులు విప్పెను!
వానకారుకు పిల్ల జోరులా
స్వాగతమిడెను
బొంగరమే!
ఇది ఏదెస కొరగునో
పూల పడవయే
ఇది ఎప్పుడు మునుగునో
అడవులు, కొండలు, మైదానాలు
సాగర సంగమ సరిగమ రాగం!
తడబడు అడుగుల
తడి హొడి తాళం
ఆది తాళం!
బ్రతుకు తెరువుకు
కరువు వాచెను
కనబడులోకం!

# సూర్యుడు

తాటి చెట్లతోపు లోంచి
అందంగ నడిచి వచ్చె !

అందాల సూర్యుడు
రంగులెన్నో చిందుతు;
పొంగి పొరలు భావాలతో
చీకటినే పారద్రోలి

వెలుగు రేఖ లందించుచు ;
కర్మసాక్షి; సృష్టి కర్త

ప్రకృతియే పరవశింప
లోకాన్ని పలుకరిస్తు !
క్రమ శిక్షణ తనని చూసి
నేర్చుకో మన్నట్టుగ !

బంతిలాగ
చైతన్యంతో బ్రతకాలని
ప్రతివారు అనునిత్యం
ఆడి పాడి, ఆనందం పొందాలని:
జగతికంత బోధించుచు

తాటిచెట్ల తోపులోంచి
అందంగ నడిచి వచ్చె
అందాల సూర్యుడు !

# అవతలిగట్టు

అంత తేలికగ
అవతలిగట్టుకు చేరుకోలేము
ఈ అంధకార బంధురమైన
బ్రతుకు చీకటిలో
కన్ను కానని యెదురు తెన్నులు
మిణుకు మిణుకుమనే
మిణుగురు పురుగులాంటి దీపంతో
మెల్లగ వస్తోంది బల్లకట్టు అదిగో!
నిర్వికార, నిరాకార, నిరామయ
ముముక్షు జనసందోహాన్ని
అవతలిగట్టున దింపి
ఈలపాటతో బల్లకట్టు ఆసామి !
గాలి వాటానికి తెరచాప ఊగుతూ;
అటునిటు కదులుతూ బ్రతుకునావ
తూట్లతో, ఆటుపోట్లతో
ప్రశాంత తపోవనం
అద్దరినుందని ఎవరో అన్నారు
శాశ్వత నిదురలో
నిశ్చల సమాధి తత్వాన్ని
అలవర్చుకని ఎంత తొందర్లో
అవతలి గట్టుకు చేరాలా? అని
అధ్యాత్మలో సంలీనం కావాలని;
అది అంత తేలికకాదు
జ్ఞానసేత్రం గాయులు కాచినా
మనసు మిగుల బ్రముగ్గాలిగా ! అంతవరకు
ఈ జీవుని ఎదురు తెన్నులు
ఎప్పటికో గమ్యం చేరేది ?

## సంప్రశ్న

ఓ చైతన్య చకచ్చకిత
స్ఫురన్మే ఘోద్భాసిత విద్యుల్లతా !
ఓ నవ నవ కోమలోత్ఫుల్ల
సౌందర్య కమలోల్లసిత కల్హారమా !
ఓ మంద మంద గమన
వాయు తరంగ వీచికా !
ఓ జ్ఞానాజ్ఞాన సదృశ
దివాంధకార దైనందిన చక్రమా!
ఓ నానానేక విభేద వ్యవహిత
ఋతువర్తనో ద్వేగినీ !
నానావిధఫల పుష్ప
వృక్ష సహిత
ఆనందమయ అనంతమయ ప్రకృతిలో
జ్ఞానా జ్ఞాన స్థితిలో నన్నెందుకుంచావు ?
ఏమిటీ ? ఎందులకీ జీవన సమరం ?

## ఆశ

ఆశ నీ-నా శ్వాస !
దటికి రానీకు దురాశ నిరాశ !
ఆశాపాశం అనంత
విశ్వాన్ని బంధించింది
బంధన బాధగ బ్రతుకే ఆశగ
గడుపుట సహజం
శ్రమించ ఫలితం
ఎండమావిలావుండే లోకం పైన
ఆశామోహం నీ కేల ?
సంతృప్తి ఎక్కడ సాధించు చూద్దాం !

## ఈ సారికి

జీవం దేహంలోంచి విడకపోతే
ఇహ లోకవాసనలు తొలగవు
కాశీ వెళ్ళినా మోక్షం రాదు
షిర్డీ వెళ్ళినా సంతోషం కలుగదు
గయ వెళ్ళినా మాయ తొలగదు
ఈ యమలోకం స్వర్గలోకంగా తలిస్తే
ఎన్ని జన్మలైనా తిరిగి తిరిగి ఇక్కడే
జ్ఞానలోకం వెలుగుకైనా
నోచనినువ్వు నవ్వుకోలేవు
ఈ లోకం మూర్ఖత్వాన్ని చూసి
కడుపుకు తిన్నదే తిండి కట్టుకున్నదే గుడ్డ!
ఉన్నచోటేచాలు నీకు
మార్పు అసహ్యం తీర్పు అగమ్యం!
పరోపకారం పేరుకైనా తలవవు
పోనిలే ఇలాగే సరిపెట్టుకో! ఈ సారికి

## స్పందన

స్పందించే మనసులోనే
అందమైన భావాలుంటాయి
వద్దైనా అందించే గుణముంటుంది
కళలన్ని, కలలన్ని కలిగుంటుంది
లలిత కళాతోరణం!
నా ఎద వాకిట తగిలించాను
నాగుండెల మండువాను
సకల కళా వేదికగా మార్చాను!
అన్ని కళల సమాహారమీ మనసు
ఈ మనిషి! రారండోయి! రండి! వచ్చి చూసిపొండి!
స్పందించే మనసేడుంటే అడనే నేనుంటా!

# మెలుకువ

కలలో మెలుకువొచ్చింది
చిలుక రెక్కలార్చింది
హంస బుద్ధిగ
పాలు త్రాగి త్రేన్చింది
మట్టి కుండలో దీపకళిక
ముసి ముసిగా నవ్వుతుంది
పసిలేని లోకంతో తనకేల?
జ్ఞానభాను కిరణాలే
జనారణ్య కరదీపికలు
మట్టిలోంచి మానవత్త్వం
మానవత్త్వంలోంచి
దైవత్త్వం అంత తేలికా?
అమ్మ వొడిలోని
పాలబుగ్గల మిసిమి
ముదిమి మీద కొచ్చిన కనరాదుగ
బోడ్డుకోసిన నాటి తెలివి
మంచాన పడ్డనాడేడ కెళ్ళెనో!
కాలగర్భంలో ఎందరో కలుస్తారు
నాకు మల్లే! నీకు మల్లే!

# పరంజ్యోతి

అంతరాత్మను నిమిరే
అమృదు కరస్పర్శ యెవరిది ?
చిరుదరహాసంతో
ఆనంద రేఖలు వెదజల్లే
ఆ చిదానందమూర్తి యెవరు ?
అన్ని సమస్యలకు
పరిష్కార మార్గం తానేనన్నట్లు
కాలిమీద కాలేసుకుని
ధీమాగా కూర్చున్న
ఆ దత్తాత్రేయ మూర్తి
నాలో యెంత ఆత్మవిశ్వాసాన్ని
పురికొల్పుతున్నాడు
బ్రతుకే పోరాటంగ
మనసే ఆరాటంతో
భవబంధాలమధ్య
నలిగే ఈజీవులకు
ప్రశాంతత నందించే
ఆ పరంజ్యోతి దర్శన భాగ్యం
ఎప్పటికో కదా
దిగులు సాగరాన్ని
దర్శన మాత్రంతో
తొలగించి
దివ్య జ్ఞానాన్ని అందించి
ఆనందంగా బ్రతుకమనే
ఆ అపార కరుణాంతరంగ
కృపాసాగరమూర్తి కిదే వందనం!

# నమస్తే నమః

ఓ కృపా
సమగ్ర మూర్తీ!
ఓ లీలా
మానుష విగ్రహా!
ఓ అవిచ్ఛిన్న
కాలాద్యనంత ప్రభావా!
ఓ అనూహ్య
భావనా ప్రస్ఫుటా!
ఓ జన్మా
ద్యనేకవ్యవహర్తా
ఓ జనన
మరణాతీతా
ఓ ప్రాణి
కోట్యంతర్భాగా
ఓ అంతర్య
మనోభావాంతర్వర్తీ!
ఓ మాధుర్య
రసవత్ కళా ప్రియా!
ఓ సృష్టి
సర్వం సంహా చక్రవర్తీ
ఓ విరాడ్రూపా
విశ్వాకారా! గగన సదృశా!
ఓం కారనాదా
ప్రణవ స్వరూపా
నమస్తే నమస్తే నమః